ఆంజనేయులు, సీరిపి, 1891-

జీర్ణవిజయనగరదర్శని

విశ్వాసరాయపురం, 1911

Record no. 510

Āṃjanēyulu, Sīripi, 1891-

Jīrṇavijayanagaradarśani

Viśvāsarāyapuraṃ, 1911

Record no. 510

## Bibliographic Record Target

ఆంజనేయులు, సీరిపి, 1891-

జీర్ణవిజయనగరదర్శని / ఇది శీరిపి ఆంజనేయులు గారిచే రచియింపబడినది.-
విశ్వాసరాయపురం : కస్తూరి శివశంకరకవి, 1911.

72 p. 19 cm.

Record no. 510

Āṃjanēyulu, Sīripi, 1891-

Jīrṇavijayanagaradarśani / idi Śīripi Āṃjanēyulu gāricē raciyimpabaḍinadi.- Viśvāsarāyapuraṃ : Kastūri Śivaśaṅkarakavi, 1911.

72 p. 19 cm.

Record no. 510

సు 5

శ్రీరస్తు.

# ఘనవిజయనగరదర్శిని.

ఇది

అనంతపురంజిల్లా ధర్మవరంవాస్తవ్యుడయిన

శీరిపి ఆంజనేయులుగారిచే రచియింపబడి

సుదర్శనీపత్రికలో

కస్తూరి శివశంకరకవిగారిచే

స్వకీయ

సుదర్శనీముద్రాక్షరశాలలో

ముద్రించి ప్రకటింపబడినది.

విశ్వాసరాయపురం

1911సం॥రము

వెల 0—8—0

లను రక్షించిన విజయనగర సామ్రాజ్యమును వేనోళ్ల గొనియాడినను తనివితీరదు. క్రీ॥ శ 1307 లో మహమ్మదీయులు దేవగిరిరాజుల జెఱబెట్టిరి. 1310 లో ద్వార సముద్రములోని భళ్ళాలరాజుల సంతమదించిరి 1323 లో నోరుగంటి ప్రతాపరుద్రుని ఢిల్లీకి గొంపోయిరి. ఇట్లు దక్షిణదేశములోని హిందూరాజ్యములన్నియు నడుగంటినందున హిందూమతమునకును దేశస్వాతంత్ర్యమునకును నాధారమేమియు లేకపోయెను. దక్షిణహిందూదేశమునకట్టి విపన్నావస్థ ప్రాప్తించినపుడు దాని నుద్ధరించుటకు నవతరించిన రాజ్యమే విజయనగరసామ్రాజ్యము. ఆప్రభుత్వమప్పుడుదయించి యుండనిపక్షమున పదునాల్గవ శతాబ్దమునందే యనగా నేటికి నైదువందల సంవత్సరములకు పూర్వమే దక్షిణహిందూదేశమంతయును సంపూర్ణముగ తురుష్కులపాలై హిందూమతమంతయును యడుగంటి మనమందఱము మహమ్మదీయులమై యుందుమనుట యతిశయోక్తి కానేరదని విజ్ఞాన చంద్రికా గ్రంథమాల యైదవగ్రంథముగా వొప్పు మహమ్మదీయ మహాయుగమను గ్రంథరాజమునం దేతద్గ్రంథకర్తలును పైగ్రంథమాల సంపాదకులునగు మ॥ రా॥ రా॥ శ్రీ. కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, ఎం ఎ గారు విజయనగర సామ్రాజ్యమును గుఱించి యథార్థముగా నుడివినారు. కొన్ని పఠనీయచరిత్ర గ్రంథములలో బహుస్వల్పముగ జెప్పి యుంటయు మనమీ విషయమై శ్రద్ధవహించి యట్టిగ్రంథముల తెప్పించి యధికముగా తెలిసికొనగోరక యుదాసీనముతో నుంటయు మిక్కిలిశోచనీయము.

విజయనగరము బళ్ళారిమండలములోని హాస్పేటకు సమీపమున తుంగభద్రానదియొక్క దక్షిణపుటొడ్డున నిలిచియుండెను. ఈనదియావలిగట్టున



రామాయణకాలమునుండి కిష్కింధయని ప్రసిద్ధిగాంచి మధ్యకాలమునుండి ఆనెగొంది (ఏనుగుసందు) అని పిలువబడు పురంబుగలదు. ఏడువందల సంవత్సరములనుండియు ఆనెగొందిరాజ్యములో హిందువులు రాజ్యము నేలుచుండిరి.

సంగముడనురాజవంశజుని పుత్రులగు హరిహర బుక్కరాయులు ఓరుగంటిరాజులయొద్ద గోశాధ్యక్షులుగ నుండి 1323వ సంవత్సరమున మహమ్మదీయులు ఓరుగంటిని ధ్వంసము చేయుగా నీయిరువురన్నదమ్ములు నోరుగంటిని విడచి ఆనెగొంది సంస్థానాధీశునియొద్దకువెళ్ళిరి. హరిహరుడా సంస్థానమునకు మంత్రియయ్యెను. బుక్కరాయులు గోశాధ్యక్షుడయ్యెను. ఢిల్లీశ్వరుడగు మహమ్మద్ తుఘలక్ యొక్క మేనల్లుడు తనమేనమామయొక్క కోపమునకు పాత్రుండైనందున నతనికి వెఱచి ఢిల్లీనుండిపారిపోయి యానెగొందిరాజు నాశ్రయించినందుకు ఢిల్లీశ్వరుడు మహాక్రుద్ధుడై 1334వ సంవత్సరమున ఆనెగొందిమీదికి దండువెడలెను. ఆనగొంది రాజు తనకపజయము సంభవించుటనిక్కమనియెంచి యందుచేనంభవించెడు పరాభవమునకు సహింపనోపక తనభార్యాపుత్రాదులను స్వహస్తములచే తనే సంహరించినవాడై కోటనుండి వెలువడి ఘోరముగా బోరి యుద్ధభూమియందు వీరశయనమునొందెను. ఢిల్లీశ్వరుడివ్విధముగ వశపఱచుకొన్న రాజ్యమునందొక యధికారినుంచి ఢిల్లీకిపోయెను. ఆనెగొందిప్రజలెల్ల జీమహమ్మదుపాలననొల్లక యాయధికా కారిపైదిరుగబడిరి. ఇందువలన ఢిల్లీశ్వరుడు ఆనగొంది రాజ్యమును పాలించుట యతిదుర్ఘటమని గ్రహించి ఆనెగొందిరాజవంశజులెవరును లేనందున ఇదివఱకు తానుగొంపోయి చెరయందుంచియుండిన యాగ్గురను రప్పించి యానెగొందిరాజునొద్ద యిదివఱకు

వారిచరిత్రింబించుక చెప్పవలసియున్నది. గావున నింకు సంగ్రహముగ పొందుపఱచెద.

సన్యాసాశ్రమమునకు బూర్వాశ్రమనామీయమునకు మాధవాచార్యులని పేరు. ఈమాధవాచార్యులు క్రీ॥శ, 1351వ సంవత్సరమున సన్యాసాశ్రమమును స్వీకరించిరి. ఇందుచే విజయనగర నిర్మాణకాలమునకీమహానుభావులు సన్యాసాశ్రమము స్వీకరించి పదునైదేండ్లు గడచియుండెను. వీరు శ్రీభువనేశ్వరీ యనుగ్రహముచేత 3 ఘడియలసేపు విజయనగరముపై సువర్ణవృష్టి గురిపించియుండిరట!! యత్యాశ్రమ స్వీకారముతో నైహిక సౌఖ్యములయందెంతమాత్రము నిచ్ఛలేనివారయ్యును దేశమంతయు దుష్ట ముష్కులవలన నరాజకమగుటయు శ్రౌతస్మార్తకర్మలన్నియు నశించుటయు జూచి స్వదేశస్వమతములుద్ధరించుటకై కేవల నిరపేక్షాబుద్ధితో నీమహానుభావులు విజయనగరమను హిందూరాజ్యమును నిర్మించుటజూడ వీర ద్వితీయ మహాపురుషులని చెప్పవలసియున్నది. ఈమాధవాచార్యులు అప్రతిమవిద్వాంసులు. తమ్ముడగు సాయణ సహాయముచేత వీరు ధర్మశాస్త్రము వేదాంతము జోతిశ్శాస్త్రము వైద్యము వ్యాకరణము మున్నగు నెన్నో విషయములమీద సద్గ్రంథముల వ్రాసి దేశోపకారము జేసిరి. వీరు 1386వ సంవత్సరమున నూటేండ్లు మీరిన వయస్సున నున్నపుడు సిద్ధిబొందిరి.

ద్వితీయహరిహరరాయలకు పిమ్మట రెండవ బుక్కరాయలు 1404 వ సంవత్సరమున రాజ్యారూఢుడయ్యెను. ఈరాజు తనరాజ్యమగు నీ విజయనగరసామ్రాజ్యమును తన తండ్రితాతలవలెనే విస్తారము చేసెను. ఈనరపాలుడు నగరమునందలి యనేకములగు పల్లపు ప్రదేశములు బూడ్పించి



ప్రాకారములను గట్టించెను. ఈప్రాకారము లీచరిత్రము వ్రాయునప్పటికి శిథిలరూపమును దాల్చియుండెను. తుంగభద్రానదికి ఆనకట్ట కట్టించి పట్టణములోనికి కాలువలను త్రిప్పి పట్టణమునజలముసమృద్ధిగనుండునట్లు జేయుటయే ఈమహాపట్టణమున కీభూమీశుడొనర్చిన మహోపకారము. ఇట్లుపట్టణమున జలసమృద్ధియైనందున నెచ్చోటచూచినను లతాకుంజములు పుష్పోద్యానములును ద్రాక్ష తాంబూలాదులగుతోటలును సమృద్ధిగ వృద్ధియై జనశోభ హెచ్చి ప్రభువునకు మాత్రముగ 12 లక్షల యాదాయము కలిగెనట. ఈకాలువ మన చరిత్రకాలమునాటికి బూడగట్టుచుండెను. ఇతడు 1422 వఱకు రాజ్యమేలెను.

రెండవ బుక్కరాయల పిమ్మట ఇతని కుమారుడగు రెండవ దేవరాయలు లేక ఇమ్మడిదేవరాయలు రాజ్యకర్తయయ్యెను. ఈనృపతి 1423నుంచి 1446వరకు ప్రజలపాలించెను. ఇతడనేక దిగ్విజయములొనర్చి విశేష ఘనతను సంపాదించెను. ఈనరపాలునకు సింహళము క్విలన్ పెలికల మున్నగు ననేక దేశముల రాజులు సామంతులై కప్పము గట్టుచుండిరట. 1443 లో ఈరాజాధిరాజునొద్దకు పారశీకపు చక్రవర్తి యొకనిని రాయబారిగా బంపియుండెనట. ఇందుచేత యీమహనీయుని సామ్రాజ్యవైభవము వెల్లడియగుచున్నది.

రెండవదేవరాయలకు సింహలదేవివలన మల్లికార్జునుడుద్భవించెను. ఇతని యనంతరమున నీమల్లికార్జునుడే రాజయ్యెను. ఈతని రాజ్యకాలమునందు కలహములులేకుండెను. తిమ్మనదండనాయకుడీతని యమాత్యుడుగానుండెను. ఈనృపోత్తముడు 1446నుండి 1465వఱకు రాజ్యమునేలెను. ఇతనికి పుత్రుడుండెను.

మల్లికార్జునుని తర్వాత యితని యనుజుడగు విరూపాక్షరాయలు రాజయ్యెను. మల్లికార్జునునకు పుత్రులుండియు నితని యనుజుడే రాజ్యకర్తయగుటచే పుత్రుని గతి యేమైనదియును మనకంతగా విశదపడదు. విరూపాక్షరాయలు 1465నుండి 1478వఱకు ప్రజాపాలనము నిర్వహించె. ఇతడు సురాపానమత్తుడై ప్రజలకగోచరుడై ఎల్లప్పుడు నంతఃపురమునందే యుండుటచేతను నితనికి మూర్ఖుడను పంచనాయకుల యత్నమునకు ప్రాపు లేనందున ననేక దుర్గములను తురుష్కులకు గోలుపోయెను. విషయాసక్తుడైన యీనృపుని ఇతని జ్యేష్ఠపుత్రుడగు రాజశేఖరరాయలు చంపించెను. 1478లో నితని తమ్ముడగు రెండవ విరూపాక్షరాయలితని నణచి నంతమొందించెను. అయిన నిట్టి దుష్టుని పాలన ప్రజలకసహ్యమయ్యె. బుక్కరాయవంశజులకు బంధువుగా నోపుట్టియు సాళువవంశజుడగు సాళువ నరసింహరాజు నగరమునందలి ప్రజల ననుకూలపఱచుకొని యారాజును పడలించి ఇతడు రాజ్యారూఢుడై విజయనగర సామ్రాజ్యమునకు ప్రభువయ్యెను. పూర్వమన్యరాజులకు గోల్పోబడిన దేశముల పరాక్రమధురంధరుండగు నీరాజు మరల జయించెనుగాని, యంతలో నంత్యకాలమాసన్నమగు తత్తి ఉదయగిరి రాయచూరు కొండవీడునను మూడు దుర్గములను మాత్రము జయించుటకసాధ్యపడదయ్యె. ఈప్రభువునకిరువురు పుత్రులుండిరి. తన యవసానకాలము సమీపించుతఱి తన సేనాధీశుడును, ఈశ్వర రాజపుత్రుడును, భగవద్భక్తిపరాయణుడును, అత్యంత పరాక్రమవంతుడునగు నరసరాజును రప్పించి, తన పుత్రద్వయమును విజయనగరసామ్రాజ్యము నాతని వశముచేసి కీర్తిశేషుడయ్యెను. ఈసాళువనరసింహరా

1487నుంచి 1490వఱకు ప్రజాపాలనము జేసె



ఈసాళువనరసింహరాజు లోకాంతర్గతుండైన పిమ్మట యితని జ్యేష్ఠపుత్రుడగు నరసరాజును రాజ్య[illegible]వాడగుటచే తుళువనరసరాజే రాజకార్యముల నిర్వహించుచుండ నాబాలరాజు నొకదుష్టుడు చంపి యాతుళువ నరసరాజుపై నేరము మోపెను. ఇట్టి యపవాదము బాపుకొనదలంచి యానరసరాజు బాలరాజు తమ్ముని రాజుగాజేసె. ఈబాలరాజు తనయన్న నంతమొందించిన దుష్టుని గౌరవించినందుచేత నితనిని చెఱయందుంచి నరసరాజే రాజయ్యెను. ఆబాలరాజు విషయమేమైనది మన కింతమాత్రమును తెలియదు. ఈతుళువనరసరాజాంధ్రకవుల నాదరించె. ఇతనియాస్థానమున నందిమల్లయ్య ఘంట సింగయ్యయను నిరువురు కవులుండి వీరిరువురును గలసి నరసరాజునకు కృతియీయబడిన వరాహపురాణమును గంగయ్యమంత్రియను నతనిని నాయకునిగ జేయబడ్డ ప్రబోధచంద్రోదయమును రెండు తెలుగు కావ్యముల వ్రాసిరి. ఈనరసభూపాలునికి తిప్పాజి నాగలాంబిక ఓబాంబిక యను ముగ్గురుభార్యలు గలరు. ఇందు తిప్పాజీవలన వీరనరసింహరాయుడును, నాగలాంబికవలన కృష్ణరాయుడును, ఓబాంబిక వలన యచ్యుతరాయుడు నుద్భవించిరి. ఈనరసరాజుతర్వాత యితని జ్యేష్ఠపుత్రుడగు వీర నరసింహరాయుడు కొంతకాలము రాజ్యము చేసినట్లీ క్రిందిపద్యమువలన తెలియవచ్చుచున్నది.

క॥ వీరనృసింహుడు నిజభుజ।
దారుణ కరవాల పరుష ధారాహతవీ।
రారియగుచు నేకాతప।
వారణముగ నేలె ధర నవారణమహిమన్॥

ఈభూమీశుడు పూజ్యంబగు రాజ్యంబేలుచుండి తన యవసానకాలమున

జయములను చెప్పఁగడంగుటకు పూర్వము దిగ్విజయములను కారణములు, రాయలకు కుడిభుజమును పితృతుల్యుఁడునగు అప్పాజి యమాత్యశేఖరుఁడగు తిమ్మరుసును గురించి మనము ముఖ్యముగా తెలుసుకొనవలసియున్నది. గాన సంగ్రహపఱచెద.

ఈతఁడారువేలనియోగి. ఇంటిపేరు సాళువవారు తండ్రిపేరు రాచయ్య. ఇంతవరకీతిమ్మరుసుయొక్క యశస్సీయాంధ్రదేశమున వెలయుచున్నది. ఈతని బుద్ధివైభవమునుగూర్చి కథలనేకము మన తెలుఁగువారు చెప్పుకొందురు. మఱియు నీతని బుద్ధివిభవమును గురించి మ॥ రా॥ శ్రీ బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులవారు దేశమాతయను పత్రికారత్నమున చూపబడిన యొక చిన్నకథనిందు పొందుపఱచుచున్నాడను.

ఆంధ్రభాషాయోషామణికి వెలలేని యాభరణములవంటి మనుచరిత్రవసుచరిత్రములన్నగు ప్రశస్తప్రబంధరాజములు శ్రీకృష్ణదేవరాయుల కాలమున రచియింపబడినవని యాంధ్రదేశీయులెల్లరకు దెలిసినవిషయమే కద! ఆ గ్రంథరాజముల యమూల్యప్రాశస్త్యము లోకవిదితమైయున్నది. గావునందుచే శ్రీకృష్ణరాయులయాస్థానమున గొప్పపండితసభ యుండెననుట సందియములేదు.

“ఒక బ్రాహ్మణుడు చాలాకాలము కాశీపట్టణమున విద్యాభ్యాసము చేసి, తనను జగదేకపండితుడని ప్రసిద్ధిగాంచెను. మన ఆర్యావర్తదేశమున నెచ్చటెచ్చట పండితసభలుండునో యచ్చోటులకెల్ల నాపండితుడుపోయి సమస్తశాస్త్రములందును ప్రసంగములొనరిచి జయమందుచు నన్నియు జయపత్రములబడయుచు వచ్చెను. ఇతని [illegible] యెఱుగను. ఈపండితుడెప్పుడైన నొకనాడు తనసభకు వచ్చునాయని రాయలు



లనుకొనుచుండిరి. ఇట్లుండ నొకనాడీజగదేకపండితుడు రాయలసందర్శనము జేసుకొనెను. కృష్ణరాయలు తనపండితసభ యోడిపోయినదను శాశ్వతమగు నపకీర్తిఁబొందుటకు నిష్టపడక ప్రసంగమక్కఱలేకయే ఆగొప్పపండితుని సన్మానించి పంపివేయుటకనేక బహుమానములతనికిప్పించుటకై తెప్పించి వానిందీసికొమ్మని యాతనికియ్యబోయెను. అందుకాజగదేకపండితుడు కృష్ణరాయలతో తమదయవలన నట్టిబహుమానములెన్నియో గలవు. నేనీబహుమానములకొఱకు వచ్చినవాడనుగాను. వాదభిక్షనడుగవచ్చితిననెను.

అనంతరము రాయలు మీయభీష్టప్రకారమే కావచ్చును అని చెప్పి తనపండితసభవారిని శాస్త్రవాదము గావింపనియోగించెను. రాయలయాస్థానపండితులును వెనుకదీయక పదునైదుదినములా జగదేకపండితునితో శాస్త్రవాదమునలిపి యెట్టకేలకు యాతనినోడించి రాయలయెదుట నతని చిహ్నములన్నియు నూడదీయించి నేనుజయింపబడితినని పలికించిరి. రాయలుదారగుణసంపన్నుడును నవరసరసికుడును, నగుటను తొలుత దెప్పించియుంచిన బహుమానములా పండితునకొసగి సన్మానించియంపివేసెను. తరువాత రాయలు తనయాస్థానపండితులిట్టి గొప్పజగదేకపండితునిజయించినారని సంతోషముచే “మీకేమికావలయునో యడుగుడిచ్చెదన” నని తన పండితులకుం జెప్పెను.

ఈపండితులలో బెక్కండ్రు దమ విద్యాప్రౌఢిమనుబట్టి రాయలయొద్ద మంత్రిత్వము బొందవలెనను కోరిక చిరకాలమునుండిచాల బలియముగనుండెను. ఇదియుగాక యీపండితులకు రాయలమంత్రియగు తిమ్మరసుపై గొంతయసూయయు మనసులో బాధింపుచుండెను. ఇట్టియా

హాగల పండితోత్తములైదారుగురు చేరి" మహాప్రభూ! తమ దివాను తిమ్మరసుగారు ధర్మశాస్త్రవిరుద్ధముగ రాజ్యాంగము నెరవేర్చుచున్నారు. రాజుయొక్క రాష్ట్రమందు జెరగిన పాపము రాజు జెందునని ధర్మశాస్త్రములు నొక్కి చెప్పుచున్నవి. గనుక ఏలినవారు మాకు మంత్రిపదవిని దయచేయుచునెడల నిదివరకు జెరిగియున్న పాపములను పుణ్యకర్మలచే పరిహరించి మరి రాష్ట్రమున పాపమహాదేవత కాలుబెట్టకుండ ధర్మశాస్త్రానుమతముగ రాజ్యపాలనము చేయుదు"మని రాయులతో విన్నవించిరి.

పిమ్మట రాయులు తనలో ఆహా! మోసము వచ్చెగదా నేనేల వీరినిక్కోరి కొనుడంటినని కొంచెమాలోచించి నేనేలాగైన వీరిబారినుండి యుపాయముచే దప్పించుకొనవలెనని మనంబున నిశ్చయించుకొని ఓ పండితోత్తములారా! నేను తిమ్మరుసును మంత్రిపదవినుండి తొలగింపవలసివచ్చిన ప్పుడు క్రొత్తగా నాయుద్యోగమున ప్రవేశించువారికొక ప్రశ్నయిచ్చెదను. దానికి సరియైన యుత్తరమిచ్చినయెడల వారికి నామంత్రిపదవియ్యగలను లేనియెడల నీయజాలనని పలికెను. మాకా ప్రశ్నయిచ్చినయెడల మేము దానికి సరియైనయుత్తరమిచ్చెదమని పండితులు మనవి చేసిరి. ఎంతైనను రాయలు రాజబిడ్డడును గడుసువాడును గనుక నే కొంచెము సేపాలోచించి పండితులవంక తిరిగి మహనీయులారా? 1 బ్రతికితే బ్రతిగేవాడు 2 చస్తే బ్రతిగేవాడు 3 అధముడు 4 అధమాధముడు 5 స్త్రీముఖుడు యీ అయిదుగురను మీరు గాని వచ్చితిరేని నామంత్రిత్వము తప్పక మీకిచ్చెదనని చెప్పెను. పిమ్మట పండితులు మహాప్రభూ! ఏలినవారు కుశాగ్రబుద్ధిగలవారు. తమరిచ్చిన ప్రశ్నలకు సులభముగ నుత్తరములు చెప్పుట యసాధ్యము. ప్రశ్నయు గొంచెము కఠినముగ నున్నటు



గాన్పించుచున్నది. దీనికి దగునుత్తరములు చెప్పుటకు కనీస మారుమాసములకాలము గావలయునని విన్నవించిరి. ఆమాటలు రాయులు విని యాపండితులనుదినకు" ఏమండోయి ప్రభువుగారూ! మామంత్రిత్వపుసంగతి నేమి చేసితి"రనియడుగుచు బీకుపకుండ ఆరునెలలు గడిచిపోవునుగదా! ఆపయిసంగతి చూచుకొందమని, మనసులో నెంచి సరే అలాగే కావచ్చునని వారికి సెలవిచ్చియంపివేసెను.

తదనంతరము పండితులు తమయిండ్లను బోయి రెండుమూడుదినములుగడచినపిమ్మట రాజుగారిచ్చిన ప్రశ్నవిషయమాలోచించుటకొక మహాసభ సమావేశము చేసిరి. ఆసభలో మొదటిప్రశ్న" బ్రతికితే బ్రతికేవాడెవడని" చర్చజరుగ నారంభమయ్యెను. అందుకు పదునెనిమిదేండ్లవయస్సుగల చిన్నవాని నొకని నేర్పరచి "పనికేమిహాయ్యేకాలమా బ్రతికితే బ్రతుకకేమి" ఇంక నాయుమానము వ్యవధియున్నదిగదా! ఈలోగా వీనిని బాగుగా మేపి వీనిచేత దండెములు తీయించి కసరతు చేయించితిమా ఆరు నెలలనాటికి వీడు దున్నలాగున తెగబలిసి రాజుగారియెదుట బెట్టుటకు తగియుండునని నిశ్చయించిరి. రెండవప్రశ్న "చస్తే బ్రతికేవాడు" ఆహా! ఏమి యీవింత! చస్తే ఏలాగు బ్రతుకగలడు! ఇదేమండోయి బహుచిత్రముగానున్నది! గ్రంథాలొక్కమాటు త్రిప్పివేసిచూచిననే గాని యీసందేహము తీరదు" అని పండితులు నిశ్చయించి యావిషయమట్టుంచిరి. మూడవప్రశ్న అధముని గూర్చి లౌకిక విరుద్ధముగ దొంగ హీనవృత్తులలో "సీతారామాభ్యాంనమః యనుచు నింటింటికి పోయి యాయావరము చేసుకొను బ్రాహ్మణుని యొకని నియమించిరి. ఏలయన నితనికంటె తక్కువయుంతష్టవాడు అధమాధముడొకడుగలడు. గనుక అధమునిగుండు

విద్యయును సంపాదించి వంట చేసికొని తినగల ప్రజ్ఞ యొకటి అతిశయోక్తిగా, పండితులు దలంచిరి. వాళ్లనవాడధమాధముడు వీడు గ్రామమునగల పదియండ్ల గృహస్థులిండ్లలో భోజనముల వేళకు దనభోజననిమిత్తమింట నొక విస్తరి సిద్ధముగా నుంచుకొని జోలికట్టుకొని భవతి భిక్షాం దేహి యని వీధివీధిని చాటుచు మాధూకర మెత్తుకొనువాని సేవ్యులనిరి. అయినవాడు నీచుడు. వీధులలో బారవైచిన ఎంగిలియాకులలోని యుచ్ఛిష్టాన్నము నేరుకొని తినువానినిందు కేర్పఱచిరి.

పండితులు అప్పటికి విడిచిపెట్టిన రెండవప్రశ్న యనగా "చచ్చిబ్రతికేవాని" గూర్చి తమయిండ్లలోని చెదపురుగులు తినిపోగా మిగిలిన ప్రాతనపు తాటియాకుల పుస్తకము లహోరాత్రములు విసుగులేక వెదకిరిగాని వాడెందును గానరాడయ్యె. కుయుక్తిగ్రంథములలో యుండునాయనుసంగతి పండితులూహింపలేరిరి. మరియు చచ్చిబ్రతికేవానిని తిమ్మరసుగాని రాయలను లేలేరనియు నట్టివాడు ప్రపంచమందుండుట యసాధ్యమనియు నిశ్చయించిరి.

ఇంతట ఆనుమానములు ముగిసెను. పండితులు తమకు రాయలిచ్చిన ప్రశ్నలకు సరియైన యుత్తరములసహితముగా దర్బారునకు రావలయునని రాజాజ్ఞ యయ్యెను. రాయల ప్రశ్నలకు పండితులిచ్చు యుత్తరముల వినుటకై పురజనులు పెక్కండ్రు గుంపులుగుంపులుగా రాజసభకు బోయి యందు గ్రిక్కిరిసియుండిరి. నిండుకొలువుండి రాయలు పండితుల కుశలమడిగి అనంతరము తానిచ్చిన ప్రశ్న సంగతి యేమైనదని ప్రశ్న వేసెను.

అప్పుడు పండితులు "బ్రతికిచెడి బ్రతికేవాడు" వీడని చెప్పి తాము దెచ్చియున్న వానిని ముందునకు దెచ్చి వానిరొమ్ముమీది గుడ్డను తొలగించి, [illegible]



ప్రభూ! తరిశిపెట్టిన మంచపుకోళ్ళవలె వీనికండలెట్లున్నవో! బలసిన వీనిరొమ్ము ఎట్లున్నదో చిత్తగింపుడు. బ్రతికిచెడి బ్రతుకకేమి వీనికి తెరువులా! యని మనవిచేసిరి. మిగిలిన నాలుగు ప్రశ్నలకు రాగల యుత్తరముల స్వభావము రాయలు వెంటనే గ్రహించి ఆపుకోవశక్యముకాక వచ్చియున్న నవ్వునాపుకొని "చచ్చిబ్రతికేవాడేడి?" యని ప్రశ్నించెను. అందుకా పండితులు వానిం దెప్పించుట తిమ్మరసుగాను త్రినేత్రునికైన శక్యముగాదని చాలపట్టుదలగా విన్నవించిరి. పండితులు యుత్తరములు సరిగా లేనియెడల వారు చిన్నబోయెదరని రాయలు తలంచి తక్కిన యుత్తరములుగూడ తెలిసికొనెను. అవియన్నియు నాభాసముగనున్నవన్నయెడల పండితులకు గోపము వచ్చునేమోయని తలంచి రాయలూరకుండెను.

శిష్టపండితుల యుత్తరముల భంగములగనున్నవని రాజు [illegible] చేయుటకు వెంటనే తనయమాత్యశేఖరుడగు తిమ్మరసుగారికి వర్తమానము పంపి రప్పించెను. ఆయన రాగానే పైప్రశ్నలు రాయలాయనకు దెలిపి ఆ యైదుగురను సభకు రప్పింప నాజ్ఞాపించెను. వెంటనే తిమ్మరసు అచ్చటనున్న రాయకచిన్న గుమస్తాను బిలిచి ఫలానిఫలానివారిని వెంటబెట్టుకొని రావలసినదని యాజ్ఞాపించెను. ఇట్టిగొప్ప రాజసభలోనే దైన్యయుక ప్రశ్నకు బూర్ణముగ నుత్తరమిచ్చినవారియందు నగమునగ ముత్తరము చెప్పినవారికి గొంచెము కోపము! అసూయయున్న గుణమ్ని గుణములు జనించుట సహజలక్షణము. అటులనే పండితులకు తిమ్మరసుగారిమీద పట్టరానికోపము వచ్చి వారే తీవ్రముగా ప్రశ్నింపగడంగిరి.

తిమ్మరసుగారియుత్తరములు:— 1 "బ్రతికిచెడి బ్రతికేవాడు" వైద్య

డు, ఏఱుఁగుని రోగికి వచ్చిన రోగమును నిర్మూలింపఁజేసి యా రోగివలన ధనము పొంది జీవించువాఁడు. గనుక రోగి బ్రతికిన గాని వైద్యునికి జీవనము జరగదని యర్థము. 2 "చస్తే బ్రతికేవాఁడు", ఇతఁడు అపరకర్మ చేయించువాఁడు. గ్రామములో నెవరైన చనిపోయినప్పుడే గాని, తక్కిన వేళల వీనిని నెవరును పిలువరు గనుక నెవరైన చనిపోయిన గాని వీనికి జీవనము జరగదు. 3 "అధముఁడు", వీఁడేమియు చేతగానివాఁడై అక్కచెల్లెండ్రయొక్క సంరక్షణలోనుండుచు నింట నామె చేయించు పనులన్నియు చేయుచు వారల చేతను బావమఱఁదులు మున్నగువారల చేతను చీవాట్లు తినుచుండెడువాఁడు. 4 "అధమాధముఁడు", వీఁడు తనకే విధమయిన ప్రయోజకత్వము లేక అత్తవారింటివద్ద పొట్టబోసుకొనుటకు ప్రవేశించి తన భార్య చేతను బావమఱఁదులు మున్నగువారి చేతను మాటలుబడుచు హీనముగా జీవించువాఁడు. 5 "నీచుఁడు", వీఁడు తనతల్లి చేతను, తోబుట్టువు చేతను, భార్య చేతను ధనార్జనకొఱకు చెప్పరాని నీచపుపనులు చేయించువాఁడు.

ఈ మాటలు తిమ్మరసు వివరించిన పిమ్మట పండితుల మొగములు చిన్నబోయి అష్టమహాసభలో తమకు గలిగిన పరాభవమునకు మిగుల వగచి ఖిన్నులై ఏమియుం బలుకనేరక మిన్నకుండిరి. అపుడు రాయలవారు పండితుల జూచి దృష్టిని గిరిచి ఇట్లనిరి. పండితశ్రేష్ఠులారా! లౌకికవ్యాపారములకును పండితవ్యాపారములకును గల భేదము నవలోకించితిరా! మీ వృత్తివారు చేయనగిన కృత్యములా వృత్తివారే చేసిన యెడల నవి రాణించును. తిమ్మరసుగారు మీ పాండిత్యపు కృత్యముల నెరవేర్పఁబోయినను మీరాయన లౌకికవ్యాపారముల నెరవేర్పఁగడంగినను, నిర్లేయాభాసముగ నుండునని పలికి పండితుల ముఖంబులకుగల మంత్రిపదవిని బడయుటకుఁ దిమ్మరసుగారి బుద్ధి



వైభవము చేత నుదాహరణప్రత్యక్షముగా పటాపంచలగునట్లు బారదోలెను.

చూచితిరా చదువరులారా? తిమ్మరసుగారి బుద్ధివైభవము! ఇంకను వీరి బుద్ధివైభవమును గురించిన కథలు విశేషముగా మనవారు చెప్పుచుందురు. ఈయమాత్యశేఖరుఁడు బాల్యంబున కడుబీదరికముచే కొన్ని దినములు పశువులగాచి గుత్తి చంద్రగిరి పెనుగొండ మొదలగు స్థలములయందు మధూకరవృత్తిచే జీవించి విద్య నేర్చుకొని యచ్చటి దుర్గాధీశుల నాశ్రయించి తన మేధామహిమవలన క్రమేణ సామ్రాజ్యమున మంత్రియయ్యె. ఈమంత్రిశిఖామణి నరసరాజు యొద్దను వీరనరసింహరాజునొద్దను మంత్రిగానుండి రాజ్యభారమంతయు వహించి రాజుల గౌరవములకును, ప్రజల గౌరవములకును పాత్రుఁడయ్యెను. తర్వాత క్రమేణ శ్రీకృష్ణరాయలయొద్ద మంత్రియై రాయలకు కుడిభుజముగానుండి తన మనోబలము చేత రాయలవారికి సౌఖ్యవిజయములకు యధికవిఖ్యాతిని గలిగించెను. రాయలవారీయమాత్యశేఖరుని "అప్పాజీ", ("నాయనగారూ") అని పిలుచుచుండిరి.

కృష్ణదేవరాయలు తొలుదొల్త 1513వ సంవత్సరమున దక్షిణదిగ్విజయయాత్రకు బయలుదేరి మైసూరుమండలములోని శివసముద్రమును ఉమ్మట్టూరును శ్రీరంగపట్టణము జయించి పిమ్మట గంగవంశపురాజుల నోడించినందున మయిసూరు దేశమంతయు స్వాధీనమయినది. ఈదేశమును జయించిన సంగతి పారిజాతాపహరణములోని క్రిందిపద్యమువలన సూచింపబడినది.

శా॥ సమ్మర్దక్షమ ధీరబంధనవిధా సంక్రందనాచార్యకా|
రమ్మౌన్యాచలవజ్రపాత జగతీరక్షాంబుజాక్షాధర|
ధ్యమ్మార్గస్థదశాస్య రాజ్యసమసవ్యాప్తిప్రచాతీశభా|

గుమ్మత్తూరి శివంసముద్రపుర వప్రోన్మాలనాడంబరా॥

మఱియు కర్ణాటక రాజ్యములోని కొన్ని చిన్న రాజ్యములను జయించి, దన మాఱుగ నేలుటకు జక్కరాయుని నియమించి కొడగు మళయాళము చేర చోళ పాండ్యరాజ్యములను జయించి యీ దేశముల మూడుభాగములుగ విభజించి యందొక్కొక్కభాగమునం దొక్కొక్కని దనమాఱుగ నేలుటకు నియమించెను.

1515 వ సంవత్సరమునందు పూర్వదిగ్విజయయాత్ర వెడలి కొండవీడు, బెల్లముకొండ, వినుకొండ, బెజవాడ, కొండపల్లి, వేగిదేశములోనుండు జమ్మలోయ, కోనసీమ, రాజమహేంద్రవరము, మున్నగు దేశములు జయించి, 1516వ సంవత్సరమున, విశాఖపట్టణమండలములోని భీమునిపట్టణమున కయిదుక్రోసుల దూరమందున్న పొట్నూరికడ నొక రాతిజయస్తంభమును వేయించి ఆ మండలములోని వీరపల్లి తాలూకా కాయంపలి వడ్డాదిని జయించి ఉత్కలదేశములోని కటకపురము వరకు బోయి, కటకపురమును గాల్చి, కళింగదేశాధీశుడై యోఢ్రదేశమును బాలించుచుండిన, ప్రతాపరుద్రదేవుడు తనకొమార్తె యగు తిరుమలాదేవి నిచ్చి వివాహముజేసి సంధి గావించుకొనెను. ఇందువలన కృష్ణరాయలు తాము జయించిన రాజమహేంద్రవరము వరకుగల కళింగదేశమును మరల ప్రతాపరుద్రదేవునకే యొసంగి యాసంవత్సరమున కాంచిపురము ప్రవేశించెను. ఇతడును తనభార్యయును పెక్కుచోటులందు మజయములను దెలుపుచు గొప్పగొప్ప క్షేత్రములలో దానధర్మములజేసిరి. ఇట్లగుటకు నిదర్శనముగ నీతడు సింహాచలమును దర్శించినపుడు భార్యాసహితముగ జేసిన దానములగూర్చి సింహాచలదేవాలయములో నేడవ స్తంభముమీద జెక్కించిన క్రిందియంశమును నుదృతిక్కనయని బిరుదుగాం



గ్ర, మ॥రా॥ శ్రీ॥ బ్రహ్మశ్రీ రాయబహదూరు కందుకూరి వీరేశలింగము పంతులవారి యాంధ్రకవులచరిత్రమునుండి గైకొనుచున్నాను. శ్రీమహారాజాధిరాజరాజపరమేశ్వర మూరురాయరగండ ఆదిరాయ విజయభాషాగీతప్రవర రాయగండ యవనరాజ్యసంస్థాపనాచార్య శ్రీవీరప్రతాపకృష్ణదేవమహారాజులు విజయనగరాన. సింహాసనస్థులై పూర్వదిగ్విజయ యాత్రకు విచ్చేసి ఉదయగిరి కొండవీడు కొండపల్లి రాజమహేంద్రవరము మొదలైనదుర్గాలుసాధించి సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు 1438అగునేటి ధాతసంవత్సర చైత్ర బ ౧౨లు స్థిరవారాన సింహాద్రినాధునిదర్శించి తమతల్లి నాగాదేవమ్మ గారికిన్ని తమతండ్రి నర్సరాజు గారికిన్ని । పుణ్యముగాను దేవునికి సమర్పించిన కంఠమా i కి ముత్యాలు99 వజ్రమాణిక్యాలకడియాలజోడు 1 న్ని శంఖచక్రాల పతకం 1 న్ని పయిడిపళ్లెం 1 న్ని తూకాలు గ44292 గానిమాడలు గ 2000 తిమదేవి చిన్నాదేవమ్మ గారి చేతను సమర్పించిన పతకం1కి గ5000తిరుమలా దేవమ్మ గారి చేతను సమర్పించిన పతకం1కి గ500 యింతమట్టుకు సమర్పించిన ధర్మశాసనము. కృష్ణదేవరాయలను పైశాసనములో మూరురాయర గండడని పేర్కొనబడినదిగద? ఈతడు ఒడ్డిరాజులగు గజపతులను తురుష్కరాజులయిన అశ్వపతులను, తెలుగురాజులయిన నరపతులను, జయించుటచేత నీతనికి మూరురాయరగండడను బిరుదము గలిగినది. మరియు నీ రాయలకనేకబిరుదములు గలవుగాని యవి యన్నియు నిందు వివరించుట యనావశ్యకము.

ఈతనికి తిరుమలాదేవియు నన్నపూర్ణాదేవియు నను భార్యలిద్దఱుగలరు. అట్లగుటను కృష్ణరాయలు తాను రచించిన విష్ణుచిత్తీయము నందలి

యీక్రింది పద్యము వలన తెలియుచున్నది.

క॥ ఆవిభునంతరంబ ధ|
రావలయముఁబూనెఁదిరుమ|లహిమైఁ జిన్నా|
ర్దేవియును నన్నపూర్ణా|
దేవియుఁ గమలాబ్జముఖులు| దేవేరులుగన్॥

చిన్నాదేవికే యన్నపూర్ణాదేవియని మరియొక పేరుగలదు. కృష్ణరాయలవిజయములనుగూర్చి పారిజాతాపహరణమునందును మనుచరిత్రయందును జెప్పబడిన పద్యముల కొన్నింటిని యిందు పొందుపఱచుచున్నాను.

చ॥ మునుకొని కొండవీడుకడ మూర్ఖత రుద్రుఁడు కృష్ణనందను|
న్మనసిజునిన్ జయించెనది మానుషమే నరసేంద్రు కృష్ణ రా|
యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాప రుద్రనం|
దనుఁడగు వీరభద్రుఁ గరుణామతిఁ గాచెజగత్ప్రసిద్ధిగన్॥

చ॥ వెలకొనికృష్ణరాయధరణీవిభుఁడుత్కలభూమిపాలుతోఁ|
గలన నెదిర్చి హస్తికరకాండతతుల్య సకంపుఁ జాముదై|
మలసినచోటఁగూడిన సమగ్రయశోవసనంబు గప్పి తా|
వెలవఁగఁజేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడుగాన నేర్పునన్॥

సీ॥ ఉదయాద్రివేగనత్యుద్ధతిసాధించె|
వినుకొండ మాటమాత్రనహరించె|
కూటముల్ సెదరంగఁ గొండవీడగలించె|
జెల్లముకొండయచ్చెల్లఁజెఱిచె|
వేలుపుకొండ నువ్వ్రాత్తి భంగముజేసె|
జల్లిపల్లె సమగ్రశక్తిఁ గూల్చె|



గినుకమీఱననంతగిరి| క్రిందుపడఁజేసె|
గంబంబుమెట్ట గ్రక్కునఁ గదల్చె॥

గీ॥ బలరికాయము కాలుముట్టుల్ నడంచుఁ|
గటకమును వింకననుచు నుత్కలమహీశు|
డనుదినమ్ము తు| వెఱచునెవ్వనికి నతఁడు|
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు॥

సీ॥ తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించె
నసిలోహమున వెచ్చనయి జనించె|
మఱికొండవీడెక్కి మార్కొని నలిరేఁగె|
యల కనసాపాత్రునంటి రాఁజె|
నటసాని జమ్మిలోయఁబడి వేగదహించెఁ|
గోనవీటేర్చెఁ గొట్టానఁదగిలె|
గవకకోటసప్తాగ్రఁగరఁచె| గౌతమిఁ గ్రాఁచె|
నేవుల నాపొట్టూరు రవులుకొనియె|
మాఁడెములువ్రేల్చె నొడ్డాది మసిచేసెఁ|
గటకపురిఁగాల్చె గజరాజు గలఁగిపఱవఁ|
దోఁకచిచ్చిన వాఁడ యుద్ధురత కృష్ణ|
రాయ బాహుప్రతాప జాగ్రన్మహాగ్ని॥

చ॥ అభిరతిఁ గృష్ణరాయఁడుజయాంకములన్| లిఖియించినట్టి యా|
స్త్రిభమునఁబొట్టునూరికడ నిల్పినకంబము| సింహభూధర|
ప్రభు తిరునాళ్లకుం దిగుసురప్రకంబు కళింగ మేదినీ|
విభు నపకీర్తి కజ్జలము| వేమఱుఁ బెట్ట| పఠించుచుండఁగన్॥ (మనుచరిత్రము

ఇంతవఱకు కృష్ణరాయలయొక్క విజయములనుగూర్చి సంక్షేపముగా వ్రాసియున్నాను. ఇక నీమహనీయుని పాండిత్యమునుగూర్చియు నితని యాస్థానమునందలి అష్టదిగ్గజములని ప్రసిద్ధిగాంచిన యెనమండ్రు పండితులయొక్క పాండిత్యమునుగూర్చియు సంగ్రహముగా తెలిసికొనవలసియున్నది. అయితే వీరివిషయమును చదువగడంగుటకు పూర్వము ముందటి రాజుల యాస్థానమునందలి పండితోత్తములగూర్చి సంగ్రహముగా తెలిసికొందము.

మనదేశమున నన్నియుత్తమగ్రంథములును తొలుదొల్త సంస్కృతభాషయందే రచియింపబడినవి. సంస్కృతభాషయందు ఐహికాముష్మికంబుల నొసంగనోపు గ్రంథరాజములును, సాంగంబులగు వేదంబులును, స్మృతిసూత్రములును, ఇతిహాసపురాణములును, ధర్మశాస్త్రములును, మున్నగు గ్రంథములు లెక్కకు మిక్కిలియై యున్నవి. వానిలో శ్రీరామాయణమును మహాభారతమును సమస్తధర్మములబోధించుచున్నందున, బహుకాలమునకు పూర్వము ధరణీనాథులు భాషాభిమానములుగాని గొప్పకవివరులచే వానినాంధ్రీకరింపజేసిరి.

రాజమహేంద్రవరాధీశుండును కావ్యగీతప్రియుండునగు రాజరాజనరేంద్రుడను విష్ణువర్ధనుడు తనకొల్వుకూటమునందెప్పుడును బహుభాషాపండితులచే నలంకరింపబడుచుండెను. ఇతనికెల్లప్పుడును భారతమును వినుటయందభిరుచి మెండుగాగలదు గావున బహుభాషలచే బహుభంగుల బహుజనులచే చెప్పబడుచుండిన మహాభారతకథను వినియుండియు యంతటితో తృప్తినొందజాలక తెనుగుభాషలోగూడ వినవలయునని యతనికెంతయో యభిరుచిగలిగి యొకనాడు విద్వజ్జనంబులచే నిండుకొలువున్న కాలమున, బ్రాహ్మణుండును, విపులశబ్దశాసనుండును, అనురక్తుడును, సంహితాభ్యాసుండును, బ్రహ్మాండాదినానాపురాణ విజ్ఞాననిరతుండును ఆపస్తంబసూత్రుండును, ముద్గలగోత్రుండును, సద్వినుతావదాతచరితుండును, లోకజ్ఞుండును, ఉభయభాషాకావ్యరచనాభిశోభితుండును, సత్ప్రతిభాభియోగ్యుండును, మత్యమరాధిపాచార్యుండును, సుజనుండును, నగు నన్నపార్యుంజూచి ఇట్లనియె.



చ॥ విమలమతిన్ బురాణములు వింటిని నేకము లర్థధర్మశా।
స్త్రముల తెఱంగెఱింగితి నుదాత్త రసాన్వితకావ్యనాటక।
క్రమములు పెక్కు చూచితి జగత్పరిపూజ్యులైన యీశ్వరా।
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్॥

ఉ॥ ఇవియేనున్ సతతంబు నాయెడఁ బ్రగర్భం బిష్టంబులైయుండుఁ జా।
యవృభూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత।
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో।
త్సవమున్ సంతతదానశీలతయు! శశ్వత్సాధుసాంగత్యమున్॥

మఱియు నదియుంగాక.

చ॥ హిమకరుదొట్టి పూరుభరతేశకురుప్రభు పాండుభూపతుల్।
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయవం।
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో।
త్తముల చరిత్రనామనతతంబు వినం గనభీష్టమెంతయున్॥

ఈపద్యములయందలి భావములను బట్టి చూడ నితడు శైవమతాభిమానము గలవాడయినను అనవరతంబు శ్రీమహాభారతమునందలి యభిప్రాయమును విన నభిలాషగలవాడనియును చక్కగా దేటబడుచున్నది. గనుక

చే. యామహనీయుడు.

క॥ జననుత కృష్ణద్వైపా।
యనమునివృషభాభిహితమహాభారత బ।
ద్ధనిరూపితార్థ మేర్పడ।
దెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్॥

అని మహాభారతమును తెనుగున రచియింపుమని ప్రార్థించి యతని మహాభారతము నాంధ్రీకరింప నియమించిన, నతడరణ్యపర్వమువఱకు నాంధ్రీకరించి మృతినొందెను. పిమ్మట మనుమసిద్ధిభూపాలునిచే "మారమా" యని పిలువబడుచుండినవాడును, పదియాశ్వాసములనిర్వచనోత్తరరామాయణగ్రంథము కొంతగా వ్రాసినవాడును, నగుతిక్కనసోమయాజి యను మహాకవి యాయరణ్యపర్వశేషమును మాత్రము వదలి విరాటపర్వము మొదలుకొని తక్కిన పదియేను పర్వములను తెనిగించెను. అరణ్యపర్వమును కొంత యాంధ్రీకరించుటచేతనే నన్నయభట్టు మతిభ్రమణముకలిగి మృతినొందెనని తలచుకొని తాను దానిని తెనిగించినచో తనగతియు నట్లేయగునన్న భీతిచేత నితడు దాని నాంధ్రీకరింపడయ్యె. అందుచేత తెనుగుభారతము కొంతకాలము పూర్ణముగా లేక కొఱతబడియుండెను. ఆకాలమునందు వ్రాయబడిన తాళపత్రగ్రంథములు నేటివఱకును కొన్ని వనపర్వశేషము లేకయే కానబడుచున్నవి. ఈకవినిపట్టిన భీతియే తర్వాత నారణ్యపర్వశేషమును జేసిన యఱ్ఱాప్రెగడకునుపట్టి తానుదానిని తెనుగింపనెంచియు తనపేరిట నాంధ్రీకరించినచో నన్నయభట్టారకునిబోలె తనకును నేదో కీడుమూడునని భయపడి మిగిలిన భాగమును రాజరాజనరేంద్రాంకితముగా నన్నయభట్టుపేరుతోనే రచియించెను. భారతములో



నీతడు రచియించిన భాగములోని మొదటిపద్యము.

చ॥ స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా।
వరణములై దళత్కమల వైభవ జృంభణముల్లసిల్లను।
ద్ధుతతరహంససారస మధువ్రత నిస్వనముల్ చెలంగఁగాఁ।
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁజూడఁగన్॥

అనునది కాబట్టి యీకవి రచియించిన దారణ్యపర్వములో సగముకన్న తక్కువగానుండును. ఎఱ్ఱాప్రగడ కవిత్వము మృదువును మధురమునై కదళీపాకమై చాలవఱకు సోమయాజులకవిత్వమును పోలియుండును. ఇతడురచియించిన భారతభాగమునందించుమించుగా సంస్కృతపదములును తెలుగుపదములును సమానముగనుండును. పైనవివరించిన విధమున తిక్కనసోమయాజులును, ఎఱ్ఱాప్రగడయును భీతిల్లిన కారణమును బట్టియే భారతమును చదువువారు సహితము నేటివఱకును అరణ్యపర్వములోని కొంతభాగమును వదలియే గ్రంథపఠనము చేయుచున్నారు. పోలయ వేమారెడ్డి ప్రార్థన నంగీకరించి ప్రబంధపరమేశ్వరుడను బిరుదందిన యీయెఱ్ఱాప్రగడ, హరివంశమును, రామాయణమును, లక్ష్మీనృసింహపురాణమును, నాంధ్రీకరించెను. ఇతడుచేసిన భారతభాగమునందలి యొకపద్యము నీవఱకే యుదహరింపబడియున్నందున తక్కినమూడుగ్రంథములనైనగూడ మ॥ రా॥ శ్రీ రాయబహద్దూరు కందుకూరి వీరేశలింగము పంతులవారి యాంధ్రకవులచరిత్రమునందుదాహరించిన రెండుపద్యములప్రకారము నిందుదాహరించుచున్నాము.

మ॥ చెఱసందోఁటలఁ బెంచి కాలియవనక్షేత్రస్థలుల్నించి యు।
క్కఱలేకుండఁగఁ బూగనాగలతికాకాంతారముల్ప్రోచి యే।

షమును, మనుచరిత్రమును, పండితారాధ్యచరిత్రమును, శాలివాహనసప్తశతి వీధినాటకము, హరవిలాసము, నను మున్నగు గ్రంథముల కృతికర్తయయ్యెను. ఈతనికవిత్వము సంస్కృతభూయిష్టమై రసవంతమైయుండును. మెత్తనిమాటలు నీతని శైలి సులభమైనది కాదు. ఇతడు రచించిన గ్రంథములన్నిటిలోను నైషధము శృంగారరసప్రధానమై ప్రౌఢముగా నుండును. ఇతడు శివభక్తుడు. ఇతడు యవ్వనదశయందు శృంగారనాయకుడై స్త్రీలోలుడై తిరుగుచుండెనట. అదెంతవఱకు నిజమో మనకు తెలియదు. ఈతనిశృంగారనైషధమును గ్రంథమునొక్కటియు, వీధినాటకమునొక్కటియు శైలికనబఱచుటకై ప్రతిగ్రంథమునందలి రెండుపద్యములనిందు పొందుపఱచుచున్నాను.

చ॥ అటులిఁగు నే సురేశ్వరుని యాతటివాఁడఖిలాప్సరోంగనా|
విటుఁడొక మర్త్యభామినికి వేడుక చేయుచునున్నవాఁడు వి|
స్ఫుటబహురత్నభూషణవిభూషితులయ్యెను రాచవారికిన్|
గటకట యారకూటకటకంబు రచింతునో కాకయొక్కఁడన్॥

ఉ॥ నీచరితంబు మాకు నతినిష్ఠురమయ్యెను లోకపాలకు|
ర్వ్యాధిక సూదికాంకురపరంపర దూర్చెదుమాటిమాటికిన్|
గా చెవులందు నీకుఁదగునా యిటు చేయఁగ దప్పతన్న బ|
ద్ధాచరణంబు నైజమొకదా తలపోయఁగ ప్రాంతమారకున్॥

శృం॥ నైషధం.

ఉ॥ వీసపుమక్కసత్తు నరవీసపుముంగరనూతిమిమ్మినన్|
గాసునురానికమ్మలర కాసును గానివి పచ్చపూసలున్|
మాసినచీరగట్టి యొవమానమెలునంగఁగ నేఁడురాగ నా|



కానలనాటివారికను కాంగిని జూచితి నీళ్లరేవునన్॥

ఉ॥ కుమ్మరివారబాలిక చకోరవిలోచన ముద్దుగుమ్మ యా|
వమ్మదరిన్ రహిన్ మలినవస్త్రము చెంగులుజాఱఁగట్టి తా|
గమ్మని మ్రోఁతతోఁ గరనఖమ్ములభాండము లంగజాస్త్ర ప్రా|
గమ్ములఁ బ్రోవుఁ దీసె విటతండము గుండియ లారవిమ్ముఁగన్॥

వీధినాటకము.

అనంతరము కొంతకాలము చనగా క్రీ. శ. 1404 వ సంవత్సరము మొదలు 1422వఱకు విజయనగరరాజ్యపాలకుఁడగు మొదటిదేవరాయలు లేక రెండవబుక్కరాయలకాలమున యాంధ్రభాష యభివృద్ధినొందె. సిద్ధనమంత్రియు నతనితండ్రియగు జన్నయమంత్రియు నను నిగుపురి రాయలయొద్ద మంత్రులుగానుండిరి. సిద్ధన్నయను మంత్రిపుంగవుఁడాంధ్రభాషయందు మిక్కుటమగు ప్రేమయుంటంబట్టి యాతఁడాంధ్రకవులమన్నించి కృతులనందె. అందుచే నియోగిబ్రాహ్మణుడును పేరయామాత్యుని పుత్రుఁడైనట్టి జక్కయకవి విక్రమార్కచరిత్రకీ యమాత్యశేఖరుడు భర్తయయ్యె. ఈలాగున పదునైదవ శతాబ్దము ప్రారంభమున యాంధ్రభాషాకవ్యాకున వయఃకాలము సంప్రాప్తించెను.

1489 మొదలుకొని 1490వఱకు విజయనగరసామ్రాజ్యమును పాలించిన సాళువ నరసింహరాజాంధ్రభాషాకవితనెంతో గౌరవించి యప్పటికవివరుల నాదరించుటచేనీమహారాజుని కాలమునందాంధ్రభాష యభివృద్ధి గాంచె. ముఖ్యముగా నీభాషయభివృద్ధిగాంచిన దీపురుషులలాఘని కాలమునందేయని చెప్పవచ్చును. ఈతనియాస్థానమున నియోగిబ్రాహ్మణు

డును, గాదయపుత్రుండును, పెదవీరన్నతమ్ముడును, భారతీతీర్థుల శిష్యుండును నిరుపమానమైన కవిత్వముగలవాడునునగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడను బ్రఖ్యాతిగాంచిన కవీశ్వరుండు జైమినిభారతమును రచియించి ఈసార్వభౌమునే కృతిభర్తం జేసె. ఈకవిపుంగవుఁడింకఁ గొన్ని గ్రంథముల రచించె.

1460 మొదలు 1509వఱకు విజయనగర సామ్రాజ్యమును వహించిన తుళువనరసరాజు గూడ మున్నటిరాజులవలెనే యాంధ్రభాషను నాంధ్రకవులను నాదరించి కృతుల నందుకొని యనంతకీర్తివంతుఁడయ్యెను. ప్రస్తుతపు తిరుపతి వెంకటేశ్వర కవీశ్వరులవలె నీతని యాస్థానమునందు నందిమల్లయ్యయు నితని మేనల్లుఁడగు ఘంటసింగయ్యయునను కవులిద్దరుండి వీరిరువురు కలసియే గ్రంథములఁ జేయుచువచ్చిరి. వీరు చేసిన గ్రంథములలో ప్రధానములైనవి ప్రబోధచంద్రోదయమును వరాహపురాణమును. వీనిలో వరాహపురాణమే యీ నరసరాజునకు కృతియీయఁబడిన గ్రంథము. ప్రబోధచంద్రోదయమునేమో అనంతామాత్యుని పుత్రుఁడైన గంగయామంత్రియునకు నాయకునిగ జేయబడెను. ఈ యుభయకవులు తమపుస్తకముల యాశ్వాసాంతగద్యములలోఁ గూడ నుభయనామములను జేర్చుకొనిరి.

"ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధ సారస్వతాభినంది సింగసింగయామాత్యపుత్రమల్లయమనీషితల్లజ, మలయమారుతాభిధాన ఘంటసింగయప్రధాన తనూభవ సింగయకవిపుంగవ ప్రణీతంబయిన," యని వ్రాయుచున్నారు. వీరిరువురు నియోగి బ్రాహ్మణులు. వీరిలో మొదటివాఁడైన నందిమల్లయ్య కౌశికగోత్రుడు ఆపస్తంబసూత్రుడు దక్షిణామూర్తిశిష్యు



డు. రెండవవాఁడైన ఘంటసింగయ్య భరద్వాజగోత్రుడు ఆపస్తంబసూత్రుడు అఘోరశివశిష్యుడు. ఈ ఘంటసింగయ్యకే మలయమారుతకవియను బిరుదాంకము కలదు. పారిజాతాపహరణమును రచించిన నందితిమ్మన్న యీ కవికి మేనల్లుఁడు.

1509 మొదలు 1530వఱకు విజయనగర సింహాసనాధిష్ఠితుండై పూర్వదక్షిణాది దిగ్విజయములందు సంగ్రామరంగ నిరతుఁడయి యున్న మనగ్రంథమున గాని సూచించిన వాఁడగు శ్రీకృష్ణదేవరాయలే యాంధ్రభాషాయోషను బోషించె. ఈమహనీయుఁడాంధ్రకవివరహృదయపుండరీకబాలభానుఁడయి యప్రతిహతప్రతాపుఁడగుచు తనయుద్దండభుజాదండంబు నిజయశమహిమ్మాదీయుల పాలిటి సింహావలోకనమై రాజ్యంబు చేయుచుండ మన యాంధ్రభాషాయోష ప్రాప్తయగుటను నిరర్థ్యాంతరము గదా! సంస్కృతభాషకు భోజవిక్రములు తావలెను ఆంగ్లేయభాషకు ఎలిజబెత్ రాణిప్రభుత్వమువలెను తెలుగుభాషకు కృష్ణరాయల ప్రభుత్వమగుటం జేసి యీమహనీయు నాంధ్రభోజుడని సుప్రసిద్ధనామముగాంచె. యీసార్వభౌముని కాలమున యాంధ్రభాష యాన్నత్యశిఖరమునకెక్కె. ఈమహనీయునికి సంస్కృతాంధ్రములందు సమానపాండిత్యము గలదు. ఇతడు సంస్కృతమున పెక్కుగ్రంథముల రచియించెనట్లు విష్ణుచిత్తీయమునందీక్రిందిపద్యమునందు చెప్పబడియున్నది.

సీ॥ పలికితి త్వేక్షోపయు జాతి పెంపెక్క

రసికులౌనన మదాలసచరిత్ర

భావధ్వనివ్యంగ్య సేవధిగాఁగఁ జెప్పితివి

సత్యావధూప్రీణనంబు

స్వాహాకారము సేయఁడో టెన్నఁడను గావంగోలు మే మోహిత సం|
దేహాంగేని రతీశవీవు మగుడక్ గేహంబుతో నుండు టే|
స్నాహా నైపము గోనకాములకు తో నైపుచ్చు నెప్పట్టునన్||

చ॥ పటిపటిక ద్విష్యమాడుకొను పొంగ్రిఫలంగాన మంపుష్పపాటి చే|
గరంగిసరివించు పత్రికము గాన దసాహృతి పిటి పాటలా|
ధరముగ సువర్ణ మంటిన విఘంబును గానదు నన్నటూలకా|
భరణముఁ గొన్నఁగాన చోక్కాలం స్వసాలుని జూచినిర్వ్యాజ్॥

చ॥ కనిపూర్వీనిందంబు సేయును భుజంగిపూర్ణి నాంచముల్|
దనదోర్దండక్షాంత దండనిభ రోదండంబున బూర్చ బో|
చన నేము పమకించు మండ నొక సాహంగాంగ నాంత్నము|
జనవా ధాగ్రిణిం జేరుపం నజన భూషా పొగ్రిధీమై నిట్టునన్॥

ఈ కావ్యము రచియించి కృష్ణరాయలకు అంకితము చేసెను. ఈ కావ్యమునందలి కానిక కృష్ణరాయలవారికి నిచ్చిన బల్లకిలో గూర్చుండఁబెట్టి తన చేతఁ బల్లకి యెత్తెను. కవిగండపెండేర మీతని కాలికి రాయలు స్వయముగా దొడిగెను. ప్రబంధములలో నీ మనుచరిత్ర మొదటిది. రాయలవారీ కవికి కోకటగ్రామ మగ్రహారముగ నిచ్చిరి. ఇతఁడు రాయలయనంతరము 1553 వ సంవత్సరమువఱకు జీవించియుండెనని చెప్పవచ్చును. కృష్ణరాయలు పుణ్యలోకమునకుఁ బోయినప్పు డీతఁడు చెప్పిన కవికరము నుద్ధ్వనింపజేసెడి క్రిందిపద్యమీతఁడు రాయలయనంతరముగూడ జీవించినట్లు తెలుపుచున్నది.

సీ॥ ఎదురైనచోఁ దనమదకరీంద్రము డిగ్గి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె|
మనుచరిత్రంబందుకొను వేళఁ బురమేఁగఁ



బల్లకి తనకేలఁ బట్టి యెత్తె|
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని తానె పాదమునఁ దొడగెఁ|
గోకటగ్రామాద్యనేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె|
నాంధ్రకవితా పితామహా యల్లసాని|
పెద్దనకవీంద్ర యని నన్నుఁ బలుకునట్టి|
కృష్ణరాయలతో దివి కేఁగలేక|
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు॥

అంతేగాక కృష్ణదేవరాయలు లోకాంతరగతుఁడు కాఁగానే కటకమునుండి గజపతి దండెత్తివచ్చినట్లును, అల్లసాని పెద్దన యీక్రిందిపద్యము వ్రాసిపంపగా నతడు లజ్జచే మరలిపోయినట్లును చెప్పుదురు.

రాయరాహుత్తగండ రాచయేనుఁగు వచ్చి
యారట్లకోటఁ గోరాడువాఁడు|
పంపెట నరపాలసార్వభౌముఁడు వచ్చి
సింహాద్రిజయశిల జేర్చువాఁడు|
వెలుగోలు సింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులఁ గరుల డీకొల్పువాఁడు|
ఘనశరనిర్ఝర గండపెండేరమిచ్చి
కూఁతు రాయలకును గూర్చువాఁడు|
నాఁడు లేఁడంగవా చచ్చితో యుర్విలేవా|
చేరజాలక తలచెడి జీర్ణమైతో|

కన్నడంబెట్టు చొచ్చెను గజపతింపరి|
తెరచినిలు వక్కచొచ్చిన తెలుఁగుతోఁప||

నందితిమ్మన్న :-- ఈతఁడారువేలనియోగిబ్రాహ్మణుఁడు; అపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; నందిసింగన్నయను తిమ్మాంబయను పుత్రుఁడు; వరాహపురాణాదిగ్రంధములను రచియించి ప్రఖ్యాతిజెందిన మలయమారుతకవికి మేనల్లుఁడు; శివభక్తుఁడు; అఘోరశివగురునిశిష్యుఁడు ఈకవిముక్కును వర్ణించిన క్రిందిపద్యమును రచించెననియు ముక్కుమీదయాపద్యమును రచించుటచేత ముక్కుతిమ్మన్న యనియు వాడుక.

శా|| నానాసూనవితానవాసనల నానందించుసారంగమే|
లానన్నొల్లదటంచు గంధఫలి బల్కానంతపంబందియో|
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై|
పూనెంబ్రేక్షణమాలికా మధుకరీపుంజంబులిర్వంకలన్||

రాయలకీర్తనియందు మిగుల గౌరవముగలదు. రాయలవారికంకితముగా నితఁడు పారిజాతాపహరణమను కావ్యమును రచియించె. రామలింగకవి నుడివిన "ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు" అనువాక్యమునందీ కవియొక్క కవిత్వలక్షణము చక్కనిదని తేటబడుచున్నది. ఇతని కావ్యముయొక్క ప్రధమాశ్వాసము ముద్దుగుల్కెడుపలుకులతో నిండి రసవంతముగానుండును.

అయ్యలరాజు రామభద్రుఁడు :-- ఈతఁడారువేలనియోగిబ్రాహ్మణుఁడు; అక్కయామాత్యుని పుత్రుఁడు; ఒంటిమెట్టగ్రామమీతని జన్మస్థానము. ఇతఁడు శ్రీకృష్ణరాయల యాజ్ఞానుసారము సకలకధాసారసంగ్రహమను తెనుఁగు కావ్యమును రచించెను. రామాభ్యుదయమను ప్రౌఢకావ్యమును రచించి



రామరాజుయొక్క యల్లుఁడగు గొబ్బూరినరసరాజునకంకితమిచ్చెను. రాయల మరణానంతరమితఁడు నలుబదిసంవత్సరములవఱకు బ్రతికియుండినట్లు గ్రంధములు నుడువుచున్నవి.

ధూర్జటి :-- ఈకవి పాకనాటి యారువేలనియోగిబ్రాహ్మణుఁడు; భరద్వాజగోత్రుఁడు; అపస్తంబసూత్రుఁడు; కాలహస్తిపురనిలయుఁడు; శివభక్తుఁడు; కృష్ణరాయలీ కవిమాధుర్యమున కాశ్చర్యపడి "స్తుతమతియైన యాంధ్రకవిధూర్జటి పల్కులకేలగల్గెనో యతులితమాధురీమహిమ" యనియడిగెనట. ఈకవి కాళహస్తిమహాత్మ్యమనుకావ్యమును కాళహస్తీశున కంకితముగ రచియించెను.

మాదయగారిమల్లన :-- ఈకవి శైవబ్రాహ్మణుఁడు; కొండవీటిపురనిలయుఁడు; ఈతఁడు కృష్ణరాయలయప్పటిలాక్షణికులైనకవులలో నొకఁడు.

క|| చెప్పఁదగుఁ గవితరసముల్|
చిప్పిల నప్పప్పభళిభళీ యన, లేదా|
యెప్పుడుఁ జేయక యుండుటె|
యొప్పుజుమీ సుకవి యెంతయు చిత్జ్ఞుఁడొకో||

అనిప్రతిజ్ఞజేసి రాజశేఖరచరిత్రమను కావ్యమును పైరాసపాలాలుకొనునట్లుగ రచియించెను. జాతీయపదములనతిసందర్భముగ బ్రయోగించుటలో నితఁడు నేర్పరి. అందులకై అత్తవారింటికేగుకన్యకకు బోధనజేసినపద్యము నొకటి యిందుదాహరించుచున్నాము.

క|| మాసినముత్యమవైకడు|
వాసియు వన్నెయునుఁగలిగి వరుఁడౌననఁగా|
నీ సకల బంధుకోటికి|

పూసలలోఁ దారమగుచుఁ బొసఁగి మెలఁగుమీ॥

పింగళిసూరన :- ఈకవిశ్రేష్ఠుడునియోగిబ్రాహ్మణుడు; గౌతమగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు; యమరన్నపుత్రుడు; ఈకవిచూడామణి రాఘవపాండవీయము, ప్రభావతీప్రద్యుమ్నము, కళాపూర్ణోదయమను, కావ్యత్రయము రచియించెను. తిక్కనసోమయాజికి దరువాతనింత ప్రౌఢకావ్యరచనయందు సర్వతోముఖపాండిత్యముగల కవియాతడే.

రామరాజభూషణుడు:- ఈకవియొక్క వాస్తవ్యనామము భట్టుమూర్తియనియు రామరాజుయొక్క యాస్థానమునందుండుటచేత రామరాజభూషణుడను బిరుదనామము వచ్చినదని చెప్పుదురు. ఈకవిసార్వభౌముడు వసుచరిత్రమను శృంగారప్రబంధమును రచియించెను. ఈగ్రంథరాజ మాంధ్రదేశమందెల్లెడల సుప్రసిద్ధనామమును గాంచెను. ఈకావ్య మాంధ్రకావ్యములలోనెల్ల నగ్రగణ్యత వహించెను. ఈకవికులసార్వభౌముఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్యమును, నరసభూపాలీయమను యలంకారగ్రంథమును కృతినందెను.

తెనాలిరామలింగకవి :- ఈకవి యాజ్ఞవల్క్య బ్రాహ్మణుడు; కౌండిన్యసగోత్రుఁడు; రామయ్యపుత్రుడు; పాండురంగమహాత్మ్యమనుకావ్యమును విరచించెను. ఈతనికవిత్వమతిచమత్కారముగను, యుక్తియుక్తముగనుండును. పైగ్రంథములోని యొకపద్యమిచ్చట వ్రాసెదను.

గీ॥ అధరముఖవర్ణశూన్యంబు లతివకుచము।
లానకాకార రహితమబ్జాక్షి మేను।
అజఘనమండలము లంచయానకురులు।
చరమఖాదితశరములు చానతొడలు॥



రాయలు విజయనగరపట్టణములో నూతనదేవాలయములను భవనములను కాలువలను నిర్మించి హంపీవిరూపాక్షములోని పంపావతిదేవాలయమున కొకగోపురముకట్టించెను. పూర్వదిగ్విజయయాత్ర యనంతరము కృష్ణస్వామిదేవాలయమను గొప్పకోవెలనొకటి నిర్మించెను. ఆసంవత్సరమే హజారరామస్వామి యాలయమునొకటినిర్మించెను. అన్నిదేవాలయములకంటెను చక్కనిచెక్కడపుపనితో శిల్పశాస్త్రనైపుణ్యమును బ్రకటింపజేయునట్టి విఠలస్వామిదేవాలయమొకటి ప్రారంభించెను. గాని రాయలతర్వాతరాజులు యీయాలయము నభివృద్ధిజేసిరి. 1525లో ఉగ్రనరసింహవిగ్రహము నొకటి శిలయందుజెక్కించెను. యీవిగ్రహము మిక్కిలిపెద్దదై చూపరకు భీతిగొల్పునదైయున్నది. ఇంవలి" జీర్ణవిజయనగరదర్శని,, యనుద్వితీయభాగమునందు పైనదెలుపబడిన కోవెలలయొక్కయు యికననేకదేవాలయములయొక్కయు విగ్రహములయొక్కయు బురుజులయొక్కయు ప్రాకారములయొక్కయు ప్రస్తుతప్రస్థితిని చదువరులు చక్కగ తెలుసుకొనగలరు. కృష్ణరాయలు తమతల్లియగు నాగలాంబికపేర నాగలాపురమను చక్కనినగరమొకటి నిర్మించెను.

ఉ॥ మాడలుమేడలున్ మఱియు బాటలుపేటలురచ్చకూటముల్।
వేడుకతోటలున్ గలుగ వింతగఁగట్టెను నాగలాపురన్।
గీడుమదిందలంచక సుకీర్తిజెలంగినతల్లిపేరటన్।
బాడియెకాదె పుత్రులకుమాతలనద్విధిగౌరవించుటల్॥ కృ॥చ ఆ౩ ప 8

1520లో విజయనగరమునకువచ్చిన పోర్చుగీసుయవనవాడును యాతనివెంటవచ్చిన పెయిజ్ యనువాడును విజయనగరమును యనేకవిధములవర్ణించిరి. ఈతనిరాజ్యమందు తొమ్మిదివందలమైళ్లుసముద్రతీరమునగలదు.

ఈరాజు యుద్ధము చేయుటకుగాను పదిలక్షల సైన్యము నెల్లెడను సిద్ధముగానుండునట్లు జేసికొనియుండెను. ఈ సేనలో నొక్కొక్కరికి వాడైన తేపుండెను. ఎనుబదివందలయేనుగులును, అయిదువందలగుఱ్ఱములును, సొంతముగానుంచుకొని నగరమునందలి వచ్చుబడినివానికొఱకు వెచ్చబెట్టుచుండెను. ఆంధ్రకవివరహృదయ పుండరీకంబులకు బాలభానుండును, సంస్కృతాంధ్రవిద్యాభోజుండును మనుచరిత్రాది సద్గ్రంథములకు భర్తయైనవాడును తినయుద్దండభుజాదండంబు మెఱయ మహమ్మదీయుల పాలిటి సింహావలోకనంబై రాజ్యంబు చేయుచుండినవాడును నగరవిజయుండును ఆంధ్రదేశమునకును ఆంధ్రరాజులకును ఆంధ్రభాషకును ప్రసిద్ధి దెచ్చినవాడునునగు శ్రీకృష్ణదేవమహారాజు 1530వ, సంవత్సరమున కీర్తిశేషుడయ్యెను.

సీ॥ వీనులవిందుగా వించుమాటలతోడఁ
దేటయై వింపెడు తెల్వితోడ।
గర్వమింతయు లేని ఘనవర్తనముతోడ
జనముఁ డుముదమందు చనువుతోడ।
పెద్దలు మెచ్చెడు ప్రీతిభావముతోడ
భద్రమౌ శ్రీరామభక్తితోడ।
నందఱుఁ గొనియాడు నట్టులు మెలఁగఁగా
గలుగుటయే గాక కైత సిప్పి।
గీ॥ బాలమన్ననఁ బడయఁగా జాతెభువినిఁ।
బల్లెనుండినకుమ్మరి మొల్లగూడ।
నీప్రభుత్వప్రభావంబు నెగడుచుండ।



నౌర శ్రీకృష్ణకవిరాజ యాంధ్రభోజ॥
శా॥ ఏకచ్ఛత్రముగాఁగ నిర్విఘ్నముగనందే రాజు నున్నేలెనే।
యేకచ్ఛత్రముగాఁగ నేలెనిఁబో యాకేలఁ జెప్పారనే।
సాకారంబలఁపించు వైభవముతో భాగ్యంబుఁ బోల్తేజుతో।
శ్రీకారుణ్యసుధాప్రవర్షములతోఁ జెల్వౌకటాక్షాళితోన్॥
సీ॥ అనుచు లోకంబు నుతియింపఁ దనని నేలి
శాలివాహన విఖ్యాతశకములోని।
రామపాండవవేద చంద్రయుతవికృతి।
వర్షమందలి పూర్వార్ధభాగమందు॥
సీ॥ కవిబుధనికరంబు కల్పతరూయని
వాప్రిచ్చివాప్రిచ్చినగమచుండ।
రాణులార్తధ్వని ప్రాణేశ్వరాయని
యుర్విపైఁబడిమూర్ఛనొందుచుండ
హాతండ్రిమము నిట్టులనవలఁ జేసితే
యని ప్రజాతతులంగలార్చుచుండ।
వైరిరాజులుగూడ వీరాగ్రణీయని
విలపించియశ్రులువిడుచుచుండ।
గాఢమైనట్టి శోకాంధకారమందు।
లోకమంతయు మునుఁగ నాలోకబాంధ।
వుండు శ్రీకృష్ణసార్వభౌముండు సుప్ర।
శస్తవిక్రమసంపన్నుఁడస్తమించె॥
ఇటులీమహానీయుఁడస్తమించిన నీసార్వభౌమునికి బుత్రసంతానము

లేనందున నతనిసహోదరుఁడగు అచ్యుతదేవరాయలు విజయనగరసింహాసనమునారోహించి 1530సంవత్సరమునుండి 1542 సంవత్సరమువఱకు నేలెను. ఇతడు పరాక్రమవంతుఁడుగాక విషయాసక్తుఁడై యంతిపురమునువదలి వెలికివచ్చుచుండలేదు. గనుక ప్రజానురాగమునకు దూరుఁడైయుండె.

అచ్యుతరాయలయనంతరమతని సహోదరుఁడగు సదాశివరాయలు రాజ్యాభిషిక్తుఁడాయెను. ఇతఁడు పరాక్రమవిహీనుఁడు గావున నితఁడు పేరునకుమాత్రము రాజుగానుండి కృష్ణదేవరాయలయల్లుఁడైన రామరాజేపరిపాలనముచేయుచుండి తుదకు నతఁడే రాజ్యారూఢుఁడయ్యెను.

ఈరామరాజునకును బాహమనీరాజులకును విరోధములుప్రబలి యుద్ధములు జరిగెను. విభాగములైయున్న బాహమనీరాజ్యప్రభువులెల్లను నేకీభవించి విజయనగరప్రభువైనరామరాజుపై 1595వ సంవత్సరమున దండెత్తివచ్చిరి. బాహమనీ విజయనగరరాజ్యములకు తాళికోటవద్ద ఘోరయుద్ధముజరిగి రామరాజుహతుఁడయ్యెను. హిందువులోడిపోయిరి. ఇట్లోడినసైనికులు విజయనగరంబునకుఁ బోయి తమభార్యాపుత్త్రులను వీలైనంతధనధాన్యములను జేకొని పట్టణమువిడచి పారిపోయిరి. ఈరణంబైన మూఁడవనాఁడు మహమ్మదీయసైనికులేతెంచి పట్టణమును ధ్వంసముచేసి ఘోరకృత్యములు సలిపి కొల్లగొనిపోయిరి. చుట్టుపట్లనున్నవారుదోచి పాడొనరించిరి. ఉండినవిజయనగరపురజనులు పట్టణంబెడఁబాసి చనిరి. విజయనగరంబు విజనస్థానమయ్యె. ఆహా! ఎంతివైభవముతో భాసిల్లుచున్నపట్టణంబు కొలదికాలములోనే ఏగతిపట్టె "జాతస్యమరణంధ్రువం" అనెడుమాట యదార్థముగదా! ఇకనీశిథిల విజయనగరమునందలి ప్రతిచోటను పూర్ణముగాచూతము. దీనితో "విజయనగరసామ్రాజ్యసంగ్రహము"ను మొదటిభాగము సంపూర్ణము.





## రెండవభాగము.



ఈవిజయనగరము ప్రాచీనమున విదేశీయులచే నెట్లు వర్ణింపబడెనో యావిషయమును గొంతగా నుదాహరించి ప్రస్తుతము చూపఁబోవు గోచరించు స్థితిని పిమ్మట వ్రాయుటబాగని తలంచి యాప్రకారము వ్రాయుచున్నాడను.

1420వ, సంవత్సరమున నీదేశమునకువచ్చి విజయనగరమును జూచిన "నికోలోడెయికోంటి,, యను, ఇటాలీదేశస్థుఁడు ల్యాటిన్ భాషలో నీనగరవైభవముల నిట్లువర్ణించియున్నాఁడు.

,,విజయనగరము"ను మహానగరము మిక్కిలినిట్రముగానున్న పర్వతములసమీపమునఁగట్టఁబడినది. ఆనగరముయొక్క చుట్టుకొలత యిరువదిమైళ్లుండెను. ఆనగరమున నాయుధములఁ ధరింప సమర్థులగువారు తొంబదివేలభటులున్నారు. మఱియు నీప్రాంతములందు నివసించుజనులు తమ యిష్టమునననుసరించి బహుభార్యలఁబరిగ్రహింపుచుందురు. వారలుజీవయాత్రముగించిన భర్తలశవముతోఁగూడ దహింపబడుచుందురు. వారిప్రభువు హిందూదేశములోని తక్కినప్రభువులకన్న మిక్కిలిశక్తిగలవాఁడు. అతనికిఁ బన్నెండువేలభార్యలుగలరు. అందుమూఁడువేలు రాజెచటికిఁ బోవునో యచ్చటికి కాలినడకనడచివచ్చెదరు. మఱినాలుగువేలస్త్రీలు సుందరాకారభూషితలై యశ్వారూఢలై వెంటనంటివచ్చెదరు. రెండుమూఁడు వేలభార్యలాతఁడు చనిపోయినపుడు శవముతోఁగూడనగ్నిప్రవేశము చే

యనిశ్చయించుకొన్నవారై యుండిరి. సంవత్సరములో నొకానొక కాలమునందు తిమయిలు వేల్పుగాఁ బూజించెడు విగ్రహమును రెండురథముల మధ్యనుంచి నగరవీధులందూరేగింతురు. చిన్నపడుచులు సుందర వస్త్రాలంకార భూషితలై దేవునిగురించి పాటలుపాడుచు వెంబడించివచ్చెదరు. అనేకులు భక్త్యావేశపరవశులై స్వామివారి రథచక్రములక్రిందఁ బడి మరణమునొందిన భగవంతుఁడు ముక్తినొసఁగునను నమ్మకముతో నాప్రకారము చేసిప్రాణములను గోలుపోవుచుండురు. మఱికొందరుప్రజ లురిపెట్టుకొని రథమునకుఁగట్టుకొని బాధనొందుచు ప్రాణములను విడిచెదరు. సంవత్సరమునకు మూఁడుగొప్పపండువులను గావించెదరు అందొకపండువుదినములలో స్త్రీపురుషాదులు బాలవృద్ధులు నదులలోను సముద్రములోను స్నానములాచరించి నూతనవస్త్రముల ధరించి శుచిర్భూతులై భజనలు నృత్యములు విందులుసలుపుచు త్రిరాత్రములు గడుపుదురు. మఱొకపండుగనాఁడు దేవాలయముల లోపలను వెలుపలను దీపారాధనఁ జేయుచుందురు. మూఁడవపండుగ నవరాత్రులు జరుపఁబడును. ఆదినములలో వీధులందు దూలములను బాఁతించి వానికొనలకు వివిధములగు రంగులగుడ్డలను జరీగుడ్డలను గట్టుదురు. మఱియు నొక్కొక్కదినమున సమస్తభూతములను సమదృష్టితోఁజూచు నొక్కొక్కభక్తిపరుని నాదూలముల చివరనుంచి నానావిధములైన పండ్లతోఁగొట్టుచుందురు. వారలంతయు నోపికతో నోర్చుకొనియుందురు. ఈమూఁడుపండుగలును గాక మరియొక పండుగ త్రిరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వసంతమనుపేరితోఁ బసుపునీళ్లను రాజమార్గమున నడచువారలపైఁ జల్లుచుందురు. ప్రజలీయది చూచి కేరింతములు గొట్టుచుందురు.,, అనివ్రాసియున్నాఁడు. ఈనికోలోడెయికొంటి విదేశీయుఁడగుటవలన రాణుల పరిచారకలనుగూడ రాజుభార్యలనియూహించి పొరపడి పండ్రెండువేల భార్యలుండిరనివ్రాసియుండవచ్చును. అతఁడుదెలిపినపండుగలునాలుగును క్రమముగ సంవత్సరాదిపండుగనియు, 2 దీపావళిపండుగనియు' 3 మహానవమిపండుగనియు, 4 కామునిపండుగనియు, దెలిసికొనదగు. విజయనగరము పర్వములకు ప్రసిద్ధికెక్కియుండెనని యాతఁడు దెలిపియున్నాఁడు.



పిమ్మట 1443వ సంవత్సరమున "అబ్దుల్ రజాక్,, అనునతఁడు విజయనగరమునుజూడవచ్చి యానగరమునిట్లు వర్ణించియున్నాఁడు.

1443న, సంవత్సరము ఏప్రిలునెల చివరకు విజయనగరము ప్రవేశించితిమి. మమ్ము దోడ్కొనిపోవుటకై మాకెదురుగాఁబరివారజనమునుబుత్తెంచి మేము బసచేయుటకై మాకొకసుందరమైనగృహము రాయలిప్పించెను. అతని రాష్ట్రముకృష్ణానది మొదలుకొని కన్యాకుమారివఱకు వ్యాపించియుండెను. ఆనగరమున వికృతాకారములు గలిగి పర్వతమును బోలిన వేయి యేనుఁగులుగలవు. పదునొకండు లక్షలసైన్యముగలదు. హిందూస్థానమునందాకాలమున నిరంకుశాధికారముగల మరియొకరాయలు గానరాడు. విజయనగరమువంటి మహానగరమెన్నఁడును గన్నులతోఁజూచియుండలేదు ఆనగరమునుబోలిన మఱియొకనగరము ప్రపంచములో నెచ్చోటనైనను న్నట్లు వినియుండలేదు. సప్తప్రాకారములచేతఁ! జుట్టఁబడిన యేడుదుర్గములచే సురక్షితమై యానగరమొప్పుచున్నయది. మొదటిదుర్గముచుట్టును నిలువెడెత్తుగల రాళ్ళు గుట్టములుగాని భటులుగాని నడుచుటకు వీలులేనియట్లు భూమిలోసగము వఱకు పాదుకొనియున్నవి. ఉత్తరముగానున్న యేడవదుర్గమే రాజునివసించు నంతఃపురమందిరముగా నున్నయది. మొదటిదుర్గముయొక్క దక్షిణపుకొన మొదలుకొని యుత్తరపుకొనవరకు దూరమెనిమిదిమైళ్ళుగానుండెను. మొదటిదుర్గము మొదలుకొని మూఁడవదుర్గమువఱకుఁగలప్రదేశమంతయు సాగుబడిచేయుబడిన పొలములతోను గృహములతోను ఉద్యానవనములతోను ఫలవృక్షములతోను నిండి

యుండెను. మూడవముగ్గాము సెలువలుకొని యేడవముగ్గామువఱకుఁగల ప్రదేశమంతయు నసంఖ్యాకములగు జనసంఘముల చేతనిండి బజారులతో నొప్పుచుండెను. రాజమందిరమునకు సమీపముగా నాలుగుబజారులొకదానికొకటెదురుగా బారులుదీర్చియుండినవి. ఉత్తరమున రాజమందిరముయొక్క ద్వారమండపము గలదు.

ప్రతిబజారుపైని సొగసైన తోరణద్వారములతోఁ గూడిన యున్నతములైన కమానులు నిర్మింపబడినవి. అన్నిటికంటె రాయలాస్థానమంటపము మిక్కిలి యెత్తుగానున్నది. బజారులు విశాలములును పొడవులును గలిగి రమణీయములైయుండినవి. గులాబిపూలంతట నమ్మఁబడుచున్నవి. ఆ ప్రజలు గులాబిపూలను నాహారముకంటె నావశ్యకములైనవిగ భావించుచుండిరి. ముత్యములు కెంపులు నీలములు వజ్రములు మొదలుగునవి బహిరంగముగా బజారులలో విక్రయింపఁబడుచున్నవి. ఈప్రదేశములందును రాజాంతఃపురప్రదేశములందును నున్నగా పాలిష్‌చేయఁబడిన రాతిగొట్టములగుండ కాలువలు పెక్కులు జలపూర్ణములై ప్రవహించుచున్నవి. రాయల [illegible]ద్వారమండపమున కెడమభాగమున రాజనగరువలెనున్న "దివానుఖానా" యను మందిరముగలదు. దానికెదురుగా నొక సభామంటపముగలదు. సభామండపమునకు చివర చోపుదారులు నిలువంబడియుండును. ఆసభామండపముమధ్య దివానుగూర్చుండుపీఠముగలదు. అచట దివానుతోక దండనాయకుఁడు ప్రజలవిజ్ఞాపనములను విమర్శించుచుండును. ఆతనికిష్టమునకు పైకిష్టలేదు. పనిముగించినతరువాత దండనాయకుడు సప్తద్వారములనుదాటి యంతఃపురముకొచ్చి సమస్తమును రాజునకు నివేదించును. రాజమందిరమునకు వెనుక దండనాయకుని గృహము



గలదు. ఆమందిరమునకెడమపార్శ్వమున నాణెములముద్రించు టంకసాలగలదు. దివానుఖానాకు నెదురుగా నేనుఁగులుండు కట్టడము గలదు. ఏనుగునకొక్కొక్కగదిచొప్పున నేర్పాటు చేయబడెను. నాణెములు ముద్రించుటంకసాలకెదురుగా నగరపాలుని గృహముగలదు. అతనిక్రిందపండ్రెండువేల భటులుండిరి. టంకసాలకు వెనుకప్రక్క పదునైదుగజములపొడవుగల యొకచిన్నబజారుగలదు. ఆబజారునకిరుపార్శ్వములయందు నిండ్లును, ముఖమండపములును గట్టఁబడియున్నవి వానికెదుట సొగసైనరాళ్లచేఁగట్టఁబడిన యున్నతాసనములుగలవు. ఆమూగదులయొక్క గోడలమీద సింహములు పెద్దపులులు చిఱుతపులులు మొదలగుక్రూరమృగములయొక్క యాకారములు చిత్రింపఁబడినవి. అక్కడియున్నతాసనములు రత్నాభరణాలంకృతులగు వేశ్యాంగనామణులచే నధిష్ఠింపబడియుండినవి. ఒకనాఁడు నన్నుఁజూచుటకై రాయల యంతఃపురమునుండి పంపఁబడిన కొందఱుదూతలువచ్చి యాదినముననే నన్ను రాయల యాస్థానమునకుఁ గొనిపోయిరి. రాజకుమారుడు (ప్రౌఢదేవరాయలు) సభామంటపమున రాజకార్యధురంధరులగు మంత్రిశిఖామణులు తన్ను బలసికొలువ సింహాసనాసీనుండైయుండెను. వానికిరుపార్శ్వముల జనసంఘము వృత్తాకారముగా నిలువఁబడి యుండెను. రాయలు పట్టుపీతాంబరమును ధరించియుండెను. పలుచనైనట్టియు పొడవైనట్టియు దేహముగలిగి నలుపును తెలుపును గాక చామనఛాయంబోలు రూపమును గలిగియుండెను. చెక్కులు మెత్తనివై పలుచనగనున్నవి.

అతనికి గడ్డమున వెంట్రుకలులేవు. చూపు మనోహరముగానుండెను. అతనికి నేనువందల భార్యలును ఉంపుడుగత్తెలును గలరని తెలియవచ్చినది

మహానవమిపండుగనాఁడు రాయలు (ప్రౌఢదేవరాయలు) తనరాష్ట్రములోనుండి తనకుఁగప్పము గట్టుచున్న సేనాధిపతులను ప్రభువులను దర్శనాస్థానమునకు రప్పించి దర్బారుతీర్చెను. వారలు మిగుల రమణీయములగు హారాదాలతో నలంకరింపఁబడిన యేనుఁగులను వేయింటిని తమతోఁ గూడఁ దెచ్చిరి.

ఆనాఁడు నగరమంతయు శృంగారముగా నలంకరింపఁబడెను. ఏనుఁగు లొకచోటునకుఁ జేరి సముద్రతరంగంబులంబోలి గనుపట్టుచుండెను. అచట చాలుగైదంతరువులగల పందిరులు నిర్మింపఁబడినవి. ఈమైదానమున కెదుట తొమ్మిదిపందిరులతోఁ గూడిన రాజభవనమొకటి నిర్మింపఁబడినది. అంతఃపురమునకును పందిళ్లకును మధ్య నాటకులును పాటకులును కథకులును నుండిరి. రాజున కెదుటనున్న తెరకావలఁ బడుచులు సుందరవస్త్రాలంకారభూషితలై నృత్యములు సలుపుచుండిరి! గారడివాండ్రు మిక్కిలియానందము ప్వొంగునట్లుగా నేనుఁగులచే నాటలాడించుచుండిరి. మూఁడు దినములు త్రివిధముగా నాటలతోను పాటలతోను వినోదములతోను గడపఁబడినవి. మూఁడవనాఁడు నాకుమరల రాజదర్శనము లభించెను. మిక్కిలి వైశాల్యముగల సింహాసనము సువర్ణముతోఁ జేయబడి యమూల్యములగు మణులచేఁ దొడుగఁబడియున్నది. సింహాసనమున కెదుటఁ జదరముగానున్న మెత్తయొకటి గలదు. దానికొనలయందు మూఁడువరుసలు ముత్యములతోఁ గట్టఁబడియుండెను. రాజు మూఁడుదినములు మెత్తపై గూరుచుండియుండెను. ఆమందిరముయొక్క గోడలును పైకప్పును మణులచే నొదుగఁబడిన బంగారుపలకలచే గూర్పబడియున్నవి. అవియును బంగారుమేకులతో బిగింపబడియున్నవి. ఈరీతిగా విదేశీయులచే వర్ణింపబడిన విజయనగరము నే



డు నేడవ పడుసారవరత్నములయుంటు మిక్కిలి యత్యాన్నత్యమును బొందియుండెనని చెప్పుటకు లేశమాత్రము సంశయింపవచ్చునా? *

ప్రాచీనకాలంబున నిట్టి ప్రాభవవైభవములచేత రాణించి యిప్పుడు "హంపివినాశ"మని ప్రసిద్ధికెక్కి యన్యదేశస్థులనుగూడ నాకర్షించునట్టి జీర్ణవిజయనగరంబును యందలి ప్రస్తుతపరిస్థితినిగురించి మనమిపుడు ముఖ్యముగా తెలిసికొనవలసియున్నది. ఇప్పుడక్కడ నాకాలమునయున్నదియున్నట్లులేదుగాని తొంటివిన్నాణమును జూపట్టుసప్తప్రాకారములను యనేకదేవాలయములును గతీణావాతములైన మందిరములును శిథిలములై పడియున్నవి.

558

(మహమ్మదీయమహాయుగము.)

ప్రస్తుతము దరోజ్, మలపనగుడి, కమలాపురము, హంపి, (పంపా) మొదలుగుని గ్రామములన్నియును, తొంటివిజయనగరములోనివె.

హొసపేట (క్రొత్తపేట)కు దరిదాపుగనె సదరు నాశనములగుపడుచున్నవి. ఇయ్యది బళ్లారికి ముప్పదియారుమైళ్లదూరముననున్నది. ఇట (హొసపేట) నుండి పూర్వోత్తరముగా పోవుమార్గముగుండ బయనమై సుమారు 1న్నర మైలునడచినపక్షమున మార్గమునకు కుడిపార్శ్వమున గొప్పదేవాలయమునొకటిని గానవగును.

ఇదికృష్ణదేవరాయలచేఁగట్టింపఁబడిన అనంతశయనదేవాలయము. దీనిసింహద్వారము ఉత్తరాభిముఖమైయున్నది. దీనిప్రాకారపుగోడ శిథిలమై యాశిలలచ్చట వసించుప్రజలగృహముల నలంకరించి యున్నవి. ఈదేవాలయము కొంతవరకు శిథిలరూపమును దాల్చినను బ్రిటిష్‌ప్రభుత్వము వారచ్చటచ్చట మరమ్మతు చేయించినారు. ఈయాలయము విగ్ర

ప్రాధాన్యమై యున్నది. ఇందలివిగ్రహమిప్పుడు హూవినహడగలితాలూకా హోళలుగ్రామములో నున్నదని బ్రహ్మశ్రీ చిత్వాడ్గిహనుమంతగారు వ్రాసియున్నారు. ఈగుడినుండి రాజమందిరప్రాంగణమువఱకు నుమార్గమునుండి దానిఉభయపార్శ్వంబుల వృక్షములును దుకాణములును గృహములును నుండినట్లు చరిత్రచెప్పుచున్నదిగాని దానిజాడలిప్పుడేమియు గానరావు. అకట్టడములన్నియు నేలసమమైయుండనోపు. అయిన నుమార్గమునందక్కడక్కడ వలయాకార గోపురాంచితములగు కొన్ని పాడుబడినగుళ్ళున్నవి. ఈగుళ్ళునదప్పలనుండియే చూడవచ్చును. ఈ యనంతశయనాలయముయొక్క యావరణములో కొందరుగొల్లలొకపల్లెను నిర్మించియాపల్లెను “అంచెనగుడి” యనిపేరిడికొని యందుకాపురమున్నారు.

ఈమార్గముగుండాతూర్పుగా మఱికొంతదూరముపోగా హాస్పేటకు 2న్నరమైళ్ళదూరములో “మల్పనగుడి,, యనునొకగ్రామము త్రోవదగ్గరనేగలదు. ఈగ్రామమును చేరకముందె యొకఫర్లాంగులో మార్గమునకెడమపార్శ్వమున చేనిలో వలయాకారపు బావియొకటిగలదు. ఇయ్యది దిగుడుబావి. దీనిలోభాగపుచుట్టును వసారాగలిగి యెనిమిది కమానులఁదీర్చికట్టఁబడినది. ఈవసారాలోనికి పోవుటకు మెట్లుగలవు. ఇది పురాతనకట్టడమైనను చూడజూడ గడుకనులపండువుగఁజేయును. ఇందలి నీరుకడుచల్లదనముగనుండి దేహముబడలికఁదీర్చి యారోగ్యమును కలుగజేయునదైయున్నది.

మల్పనగుడిగ్రామమునకు దక్షిణపునొకచేనిలో పడుండబెట్టిన రాతిమీద విజయనగరప్రభువైన దేవరాయనృపతి క్రీ, శ 1410వ సంవత్సర



మున దానముచేసిన యొకశాసనమున్న,, దనివ్రాసియున్నారు. అయినను యందెచ్చటచూచినను యగుపడలేదుగాని భూమిలోపూడియుండునేమోయని సంశయించుచున్నాను. యాత్రికులెవరైనను కనిపెట్టిన దానినిజస్థానమును దెలుపఁవేడువాఁడను.

మల్పనగుడినిదాటి మఱిరెండుమైళ్లు నడచినపిమ్మట నీదారి రెండు గాఁచీలి యందొకటి తూర్పుగా కమలాపురమువరకును, రెండవది పూర్వోత్తరముగా హంపికిని బోవును. ఇచటనొక సుంకముచీయు కచేరియును గ్రామమార్గములఁదెలుపు కొయ్యస్తంభమును గలవు. తూర్పుగా బోవు దారిగుండ కమలాపురమును చేరదగును.

కమలాపురమునకును హాస్పేటకును గలదూరమేడుమైళ్ళు. బాటసారులుదిగుటకీకమలాపురమునందొక సత్రముగలదు. ముందిది ప్రాచీనమండపము. బళ్ళారిజిల్లాకలెక్టరుగానుండిన మాష్టరుగారీప్రాచీనమండపమును సత్రముగామార్పించి లోకల్ఫండుబోర్డువారి వశముచేసినారు. మఱియు నీగ్రామమునందొక తపాలాఫాపీసియు పోలీసుఠాణాయునుగలవు. ఇందలిభాష కన్నడము. జీర్ణవిజయనగరమును చూడఁగోరువారీసత్రమును బసగానేర్పఱచుకొనిన ముందుచెప్పఁబోవు శాసనములనుజూచుట కనుకూలముగనుండును.

సత్రమునుండి యుత్తరముగా పురబాహ్యమునకువెళ్ళి యచ్చటినుండి తూర్పున సుమారొకటిన్నరమైళ్ళదూరముపోయిన పట్టాభిరామస్వామి దేవాలయము అగుపడును. దీనిసింహద్వారము పూర్వాభిముఖమై యున్నది. ఈదేవళము మిక్కిలిపెద్దదియై తక్కినదేవాలయములవగిది పాషాణనిర్మితప్రాకారముగలిగి విగ్రహహీనమైయున్నది. ప్రాకార

ములో లోతైననీరులేని పానుపానుయొకటిగలదు. ప్రాకారమున కుత్తర దిశ యందొక ద్వారముకలదు. గర్భాలయమునకు దక్షిణమునందొక మంటపముగలదు. ఇందొక్కొక్క స్తంభము 10, 12 చిన్న స్తంభములేకశిలలో చెక్కబడినవి. ఈ యాలయముయొక్క సింహద్వారముపైన సామాన్యమనుజుడు రాయి తవ్వజాలనంత యున్నతముగల గోపుర మొకటి యున్నది. ఇదికొంతవఱకు శిథిలమైనది.

ఈ గుడికి కొంతదూరమున మార్గమునకెడమపార్శ్వమున జుట్టును మండపములుగల కొలనొండుగలదు. ఇప్పుడందులో జలములేదు. ఆ కాలమున కమలాపురసమీపముననుండు చెరువునుండి నీటి నిందు దెచ్చుచుండవచ్చును. ఇంకను దూరముపోవ నెన్నియో పాడుపడిన గుళ్ళున్నవి. వానినన్నిటిని జూచి కమలాపురమునకు బయలు మరలవలెను.

పత్తిమునుండియుత్తరముగా పి. డబ్లియు. ఇన్స్పెక్టర్, బంగ్లా, యుండరగాపోవు వంకరటింకరమార్గముగుండా "పాలుపట్టె" యని యిప్పుడు పిలువబడు నగరమధ్యమునకు వెళ్లవలెను.

మార్గమునకు కుడిపార్శ్వమున సుమారు 200 గజముల దూరమున చంద్రశేఖరమతమను నొక యాలయమును జూడవలెను. దీనిసింహద్వారము పూర్వాభిముఖమైయున్నది. ముఖమండపము ప్రాకారములోని శిథిలరూపము బొందినది. గర్భాలయమునకు దక్షిణపార్శ్వమున ప్రాకారముయొక్క రెండుమూలల యందును శిథిలములై రెండు మండపములు గలవు. సింహద్వారముపైన గోపురమున్నదిగాని చాలయెత్తుగలేదు. ఇందులో విశేషమైనది గాని రమ్యమైనది గాని యేమియు లేనందున దీని పరరాజులు పాడుచేయక విడిచినారు. ఇందుచేతనిది యథాస్థితిలో



నున్నది. విగ్రహహీనమైయున్నది.

ఇచ్చటనుండి మొదటిమార్గముగుండా పశ్చిమముఖముగా కొంతదూరము వెళ్ళినచో అంతఃపురస్నానగృహమును జూడవచ్చును. దీనిచుట్టును లోభాగమున ప్రతిప్రక్కను అయిదుచొప్పున కమానులుగల వసారాగలదై మధ్యభాగమునందు సుమారేడడుగులలోతును, చచ్చౌకముగా 30 అడుగుల పొడవు నంతియవెడల్పును గలిగి చుట్టును అడుగుభాగమునను గచ్చుచేయబడిన నలుచదరపుపల్లమొండుగలదు. ఈ పల్లములోనికి దిగుటకు ఉత్తరపుగోడయందు మెట్లుగలవు. మెట్టుమీద తుంగభద్రానదినుండి నీళ్ళు దీసికొనివచ్చు "మోరీ" యను కాలువ యీగృహమునకు దూర్పుదిశయందున్నది. ఆ కాలువ యచ్చటచ్చట శిథిలమైనది. గృహమునకు నలుప్రక్కలను ద్వారములు నాలుగుగలవు.

ఈ స్నానగృహమునకు చెంత త్రిభుజాకారముగ రెండుమార్గములు కలియుచున్నవి. అందొకటి మొదటకొంతవఱకు పశ్చిమముగను పిదపయుత్తరముగను తిరిగి హంపిలోని ముఖ్యదేవాలయమగు శ్రీ విరూపాక్షదేవాలయమునకుం బోవును. రెండవది పశ్చిమోత్తరముగా వెళ్లును.

రెండవమార్గముగుండా సుమారు రెండుఫర్లాంగులదూరము నడచినచో దారికి వామపార్శ్వమున సుమారెనిమిదడుగులలోతును అరఫర్లాంగు పొడవును ముప్పదిగజముల వెడల్పును గలదై నలుచదరాకృతిగ ముందు జూడబడిన స్నానగృహమునందలి పల్లమువలెనె గచ్చుచేయబడిన పల్లమొండుగలదు. తుంగభద్రానదినుండి నీళ్ళను గొనిపోవు "మోరీ" యను కాలువ ఈపల్లమునకతిదూరముననే భూమిమట్టమునకు సుమారు కరియడుగులయెత్తుమీద పూర్వపశ్చిమముగా పోవుచున్నది. ఇయ్యది ప్రా

డవునవ గండశిలయందు తొలువబడిన కాలువ. ఈపల్లమునకిది యుత్తరమునందున్నది. ఆకాలువనుండి యీపల్లమునకు నీటిని గొనివచ్చుటకై మరిరెండు కాలువలనీపల్లమునకుఁ దెచ్చియున్నారు. ఈయుపకాలువలంతయును సిథిలరూపము. ఈపల్లమునకిట్టి కాలువల నుంచడముఁజూడ నిదియును స్నానపల్లమై యుండునని యూహించనగు.

దీనికనతిదూరముననే "మహార్నవమిదిబ్బ" యనిపిలువఁబడు విజయదశమిసింహాసనమొండుగలదు. ఇది చుట్టును రాతికట్టడములతోఁ గూడిన గొప్పచుట్టిపట్టు. ఆకాలమున రాజులు దసరాపండుగదినములలో నవర్యాయ్యగవినోదములును, జట్టిపట్లను మల్లయుద్ధములను దానిపైనుండి జూచుచుందురు. దానిపైన తూర్పుభాగమున సగముమీద మనుగుభాగమువఱకు దిగుటకు రెండుప్రక్కలను మార్గములు గలవు. అందముగుభాగమున గోడతోఁగూడిన బండకైనవిగ్రహములుగలవు. ఆచ్చటకొందరు పామరులావిగ్రహములను పంచపాండవులనిభావించి నేటికిని పూజలు సలుపుచున్నారు. ఈదిబ్బయొక్క పార్శ్వపురాళ్ళమీద గుఱ్ఱములు, ఏనుఁగులు, లొట్టిపిట్టలు, పులులు, వేటకాండ్రు లేళ్లనుతరుము వేటకుక్కలు, ఆటకత్తెలు మొదలగు చిత్రములును చెక్కబడియున్నవి. ఇప్పటికి నాలుగుసంవత్సరములక్రితమీదిబ్బలోపలికి వెళ్లుటకచ్చటనైనను ద్వారమున్నట్లేమో మారిమని యాదిబ్బయొక్కవలుపార్శ్వములను సుమారు పదియడుగులలోతువఱకు త్రవ్విరనియు నిందుకైకొందఱు కూలీలందులోపడియుండుటవలనను ద్వారమెచ్చటనగుపడని కారణమునను యాకృత్యమునువదలి యాపల్లమును మరలబూడ్చిరనియును తెలియవచ్చెడిని. దీనిచుట్టును ప్రాకారపుగోడయొకటియుండెడి యుపుడంతయును సిథిలమైయుత్తరపా



ర్శ్వమునందుమాత్రము నిలచియున్నది. ఈదిబ్బపైకెక్కుటకు పశ్చిమపార్శ్వమున మెట్లుగలవు.

ఈసింహాసనముయొక్క ప్రాకారపుగోడ కుత్తరపార్శ్వమునందొక పెద్దరాతితలుపు పానింపబడియున్నది. ఇది ఏకశిలామయము. ఇయ్యదిసుమారు పదియడుగుల యెత్తు మూడడుగుల వెడల్పు కానిమిదంగుళముల మందమును గలది. దీనికిసామాన్యకొయ్యతలుపునకువలె వెనుకభాగమున గడవేయు రెండుతూములుగలవు.

ఇచ్చటినుండి పూర్వోత్తరముగాసుమారు అరమైలుదూరముపోగా నటిరంగస్వామిదేవాలయమును చూడనగును. ఇది పూర్వాభిముఖమైనది. చాలవఱకు సిథిలముయినది. అన్నిదేవళములవలె నచ్చటచ్చట మరమ్మతు చేయబడినవి. సగముభాగమువఱకు పూడియున్నందున నీకోవెల యామట్టిత్రోసివేయబడినది. ఇందు చూడదగువిశేషాంశములేవియును లేవు.

ఈయాలయమునకు దక్షిణపార్శ్వమునందొక మండపముగలదు. అందుసుమారు పండ్రెండడుగులనిడివిగల యాంజనేయస్వామి శిలావిగ్రహమొండుగలదు. ఈవిగ్రహమునకెదుట అనఁగా యావరణపుదక్షిణపుగోడయొక్క లోభాగమున సుమారారడుగుల నిడివియు రెండడుగులవెడల్పునుగల బండమీద ప్రాతకన్నడాక్షరములతో నీశాసనముచెక్కబడినది.

"శాలివాహనశక 1458 విశ్వావసునామసంవత్సర చైత్రశుద్ధతదియ, గురువారమునాడు రాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరసదాశివరు విద్యానగరమందు రత్నసింహాసనాసీనుడై రాజ్యమును చేయుచుండగా శ్రీమన్మహామండలేశ్వర మాధవరాజు మల్లరాజుగారమనమను వల్లు

థరాజుగారికొమారుడు తిమ్మరాజుగారు విద్యానగరము పెద్దఅంగడి కిఁ పైలనంతకు పడమటనుండే మాధవదేవరకు రంగమండపముయొక్క విశాలము 25 అంకణములు నిత్యోత్సవాలయందు నృత్యగీతవాద్యాదివైభవాదులకు యోగ్యముగాను ఆచంద్రార్కస్థాయిగాను తమతండ్రి వల్లభరాజుంగారికిన్ని తమతల్లి వెంగళమ్మగారికిన్ని పుణ్యముగునట్లుగా సమర్పించెను. మంగళం మహాశ్రీ యుంజెయును,, అనియున్నది.

ఈరంగస్వామిదేవళమున కుత్తరముం దగతిదూరమునడువగ నొక్కకోటగోడ కానవచ్చును. ఈకోటగోడగుండ లోనబ్రవేశించిన రాజాంతఃపురావరణమును జేరవగును,

ఈయంతఃపురావరణములో "సభాభవనము,, అను రెండంతస్తులకట్టడమున్నది. ఇదియంతయును కమానులుతీర్చబడి కడురమణీయముగ కట్టబడినది. దీనియుత్తరపార్శ్వమున మీదియంతస్తునకుఁబోవుటకు మెట్లుగలవు. పైయంతస్తుసహితము క్రిందివలెనే కమానులుతీర్చికట్టబడినది. ఇయ్యది కట్టబడి యెనుబదిసంవత్సరములైనను నేటికిని చెక్కుచెదరక తొంటివిన్యాసమునందేయున్నది.

ఈసభాభవనమునకు పశ్చిమపార్శ్వమున గోడలైనను లేక యెత్తుగానున్న పునాదియున్నది. ఇది రాజాంతఃపురమయి యుండనోపు.

పునాదికి పశ్చిమోత్తరమున "జనానా,, అను నిర్మాణమొకటియున్నది. దీనిలోభాగమునచుట్టును కమానులుగలకట్టడమున్నది. ఇయ్యదిని ముచవరముగనున్నది.

ఈప్రాకారములో నికనెన్నియో మందిరములున్నట్లు అందుబడిన శిథిలములవలనఁ దెలిసికొనవచ్చును.



ఈయంతఃపురప్రాకారమునకు నెలుపల రాజనగరు, టంకసాల, సేనానులయొక్కయు ప్రభువులయొక్కయు సౌధములు, మనోజ్ఞములగు గృహములు యుండెనట. ఇవియెయ్యెచోటనుండెనని స్పష్టముగ నిప్పుడు చెప్పుటకు సాధ్యముకాదు.

ఈయంతఃపురప్రాకారమునకు దూర్పుభాగమున ఏనుగుసాలయున్నది. ఇందుబదునొకండేనుగులగట్టుటకు విశాలములైన పదునొకండు గదులున్నవి. ఈగజసాలలో నుత్సవసమయములందుమాత్రము దేబమునట్టిఏనుఁగులఁగట్టుచుండిరట. వానిలోనున్న మధ్యచావడికి మిద్దెయుండి పైకిఁబోను మెట్లుగలవు. ఇందు బహుశః పట్టపుటేనుఁగును యుండియుండవచ్చును.

ఈగజసాలదగ్గరనే పశ్చిమదిశయందు నాట్యశాలయున్నది. ముందటిభాగమున రెండుపంచలయందును రెండు పెద్దమెట్లుగలుండి ప్రతియొకగుమ్మమును యెదేనిచొప్పున పదికమానులుగల వసారాయున్నది. లోపలసహితము వలుప్రక్కలను అనుగుణంబైనన్నిగలిగి అందుసహితము ముందటిభాగమువలె కమానులుగల వసారాయున్నది. మధ్య నిడుదవరముగ పల్లపుప్రదేశముగలదు. బహుశః యీప్రదేశములో జెట్టీలు మల్లులు మల్లయుద్ధములుజరుపుచుండ చుట్టునుండువసారాలలో రాజులు చూచుచుండనోపుదురు.

ఈనాట్యశాలకు నుత్తరమున రెండుఫర్లాంగులదూరమున నొకచిన్నకొండయొకటియున్నది ఈకొండవప్పునమీద నక్కడక్కడ కట్టడములు నెన్నోగుహలునున్నవి. ఈకొండవప్పున నెక్కడ వందుగదివలెనుండు యొకపెద్దగుహయున్నది. అదియొకప్రాచీనమయియుండనోపు.

ఈపర్వతరాశికి దక్షిణపార్శ్వపుక్రిందిభాగము పొడవునను పచ్చని పచ్చికచేతను యందచ్చటచ్చట నానాలతలు వివిధవర్ణములుగల పుష్పములవికసింపఁజేయుటచేతను యచ్చటిసుందరరత్నకంబళము పరచినట్లుండి కనులపండువుజేయుచుండెను. దీనికిముందు(దక్షిణ)భాగమునందలి భూమిఘనమహీరుహములకు నెలవుగాకపోయిన నచ్చటచ్చటవివిధజాతుల చిన్నచెట్లును, పొదలవలెనల్లిబిల్లిగానల్లుకొనిన లతాకుంజములును నేత్రపర్వమొనర్చుచుండెను. వలపుఁగోలుపు జెలువుగులుకు పలుకులుగల పులుగులాదిఋవ్వాకముల పైఁగూయుచుండి మధురరుతములు చేయుచు శ్రవణరంధ్రముల విందుగొలుపుచుండెను. కీర శారికాదులపలుకులు శ్రోత్రరసాయనముగ వినఁబడుచు గట్టెక్కగాగలిగిన పరిశ్రమను దోపజేయుచుండెను. ఇట్లుసొబగొందుచున్నయీవనము క్రూరసింహశార్దూలాదిమృగములు సంచరించుటకుఁదగినది కాకపోయినను సుందరవిశాలచంచలలోచనములుగల హరిణములును, శశకములును, మర్కటమార్జాలాది సాధారణమృగసమూహమునకు నెలవైయుండెనని నొక్కిచెప్పవచ్చును. ఈవనమునకుఁదక్షిణమువైపున తుంగభద్రనదిసన్నగిలి పశ్చిమపూర్వముగా బ్రవహించుచుండెను. ఈప్రవాహమునకు ముందట్టిట్టు వరిపొలములుసమృద్ధిగ బెరగియుండెను. అందుసువర్ణచ్ఛాయగలకొన్నివరిపొలమునందలి పైరులువహింపజాలనన్ని ధాన్యపుగింజలుగల వెన్నులనుకలిగి విద్యావినయములుగల సజ్జనులభాతి వసుంధరకు తమశిరములనువంపజేయుచుండెను. అందులోకొన్నిరిక్తగింజలుగలవై వంగవర్ణముగల వెన్నులనుగలిగినపైరులు విద్యావిహీనులగు దుర్జనులపగిది తమలోపములనెఱుగక దాంభికముచే తలయెత్తి తమతెల్లదనము నెల్లఱకును

జూపుచుండెను. మఱియు నచ్చటిజలప్రవాహములును అరటిచెఱకు తోటలునతిశయముగ బెరిగి నయనోత్సవముఁజేయుచు నందుండివీచెడిమందమారుతము మనస్సునకెంతయు నుల్లాసమునుగలుగఁజేయుచుండెను. ఆహా! నగరశోభ హెచ్చుచున్నపుడీ జూచినను లతాకుంజములును, పుష్పోద్యానములును, ద్రాక్షతాంబూలాదితోటలును సమృద్ధిగ బెరిగి వివిధకుసుమపరిమళభారమునువహించి వాయువు తనగంధవహనామమును సార్థకపఱుప నీమచుండిన ప్రాచీనకాలంబున ప్రజలెంతయానందముబొందుచుండిరో వర్ణింపనేరితరము? అపరిమితమనోజ్ఞంబై ఫలభారమునవంగి ధరనుస్పృశించుచు గ్రొన్ననలచెన్నువహించుతీవపూలచేనేత్రపర్వమై యచ్చటికోజిలు దినదినమును భగవన్నామములను భజించు భక్తులకు నెలవై యనుదినమును నృత్యగీతవాద్యాది వైభవములసౌభాగ్యమై యొప్పారుచుండిన యీపుణ్యభూమి భూతలస్వర్గమైయుండెననినుడువుటకు లేశమైనను సందియముగలదా?

ఇది ఋష్యాశ్రమమై యుండెనో,, అని పైనపేర్కొనఁబడిన కొండభాగము,, మాతంగకొండ" యనంబరగు. మఱియు దీనినంటియున్న పర్వతములకు ,,మాల్యవంత, ఋష్యమూక, అంజనపర్వతము,,లని పేరు. ఈ మాతంగకొండమీఁద నొకదేవాలయముకలదు. దానికిమాతంగగుడియని పేరు. దీనిప్రాకారద్వారము దక్షిణాభిముఖమైయున్నది. ఇందు రెండు మండపములుగలవు. అందులోగర్భాలయముమాత్రము యుత్తరాభిముఖమైయున్నది! ఇందు శ్రీరామస్వామివిగ్రహముకలదు. ఈయాలయమునందిపుడు బైరాగులువాసముచేయుచు నావిగ్రహమునకిప్పటికిని పూజగావించుచున్నారు. వాలివధనమునంతరము సుగ్రీవుఁడు కిష్కింధ పట్టా

భిషేకమైనపిమ్మట. ఆషాఢమాసమువచ్చుటచేతను యానాలుగుమాసములు గాలివర్షములగుటచేతను శత్రునిమీదదండెత్తిపోవుట తగదని సుగ్రీవునిరాకకై కార్తికమాసముదాక రామలక్ష్మణులిందు సీతావియోగదుఃఖముచే నుండిరని తెలియుచున్నయది. ఈకోవెలవెనుక (కొండయెక్కుయాత్ర) పైపునసహితము క్రిందికిదిగుటకు మెట్లుగలవు. ఈమెట్లుదిగుచుండ దిగువేళ గదివంటి పెద్దగుహాలను చూడవగును.

ఇట్లుమాతంగగుడినుండి క్రిందకిదిగి తుంగభద్రకాలువనుదాటి నదిఱొడ్డుమధ్యనడచిన సమీపముననే యొకపెద్దగుడిని చేరవచ్చును. కొండ మూదెదిగినప్రదే యీకోవెలనుజూడనగును. ఇయ్యది [illegible] డి. ఇదికనుగొప్పదియై ముందుచెప్పబడిన పట్టాభిరామస్వామికోవెలవలె నున్నది. దీనిసింహద్వారము తూర్పుదిక్కుముఖమైయున్నది. [illegible] రైదామఫల్లాతులపాడవునబెద్దవీధియున్నది. [illegible] ల నంగళ్ళుండుటకుదగిన చావళ్ళున్నవి. [illegible] ద్యములు, నవరత్నములు, వివిధఫలములమ్ముచుండెడువారట. [illegible] దారుంగడి యుండ్లుపాడుపడిమధ్యనుండినబాట [illegible] డుచున్నది.

పిమ్మట యటనుండిమరలి కమలాపురమునందలి బసకేగి యారాడనవ టవిశ్రమించనగును.

మరునాడుదయమునలేచి యుదయమునరాగ [illegible] బ్రాతఃకాలశీతవాయువులాఘ్రాణించుచు [illegible] పట్టిమార్గముగుండ బయనమై విజయనగరసింహాసనమును దాటి [illegible] ఘుగా రాజాంతఃపురావరణమునకుబోవుమార్గమునువదలి పచ్చిమోత్తర



ముగాబోవుమార్గముగుండ నడచినచో మహార్ణవమిదిబ్బకనతిదూరముననే రమారమి నలుబదినిమిదియడుగుల పొడవును, మూడడుగులవెడల్పును, రెండడుగులయెత్తుగల్యమును, గల గండశిలనుదొలచి చేయబడిన తొట్టియొకటి యచ్చట మైదానమున కానియుండుటజూడనొప్పుదురు. దీనికి ఉత్తరపుభాగమున తూమువంటి వలయాకారపురంధ్రమొండుగలదు. ఆకాలమున తొట్టిలోబాలుపోసి యేనుగుపిల్లలకు త్రావించుచుండిరట.

దీనిని వదలి మరికొంతమార్గముపోగా మార్గమునకు వామపార్శ్వమున రామచంద్రస్వామిగుడి గానవగును. ఈకోవెలతక్కినకోవెలలవలె యంతపెద్దదికాదు అన్నిటియందువలె దీనియందును విగ్రహహీనమైయున్నది. దీనిసింహద్వారము పూర్వాభిముఖము. ఈయాలయమున ప్రవేశించగనే భక్తియు గౌరవాశ్చర్యములుస్ఫురించును. ఆలయమునందలిగోడలమీద నానావిధములగు విగ్రహములను చెక్కియుండుటను జూచుటవలన. ఇందచ్చటచ్చట ప్రాచీనకన్నడాక్షరములతో శాసనములు గానవచ్చును. గర్భగుడికెదుటి ముందుండు మండపమునందలి నల్లరాతిస్తంభములమీద భక్తినిగొలుపజేయు విగ్రహములనేకములు చెక్కబడియున్నవి. ఈవిగ్రహములతిసూక్ష్మముగజెక్కబడి పూర్వశిల్పనైపుణ్యమును దెల్పుచున్నయవి. గర్భాలయమునకుత్తరభాగమునందొక మండపముగలదు. దక్షిణాభిముఖమగు దీనిద్వారమునకు కుడిపార్శ్వపుగోడమీద "శాలివాహనశక 1435 శ్రీముఖసంవత్సర చైత్రశుద్ధ [illegible], యీయాలయము శ్రీకృష్ణదేవరాయలచే కట్టింపబడినట్లు స్థిరపడు శాసనమొకటియున్నది.) ఈమండపములో రామాయణకథావిశేషముల దెల్పునవైక

సురమ్యములైన విగ్రహములు గోడలకు చెక్కఁబడియున్నవి. హజారమనగా ప్రాంగణము. రాజప్రాసాదావరణమునకున్నందునుచే దానికాపేరు వచ్చియుండవచ్చును.

ఈదేవాలయమునకు వెలుపలి మఱికొన్ని యడుగులు ముందునకుపోగా నొకకట్టడముగలదు. దీనిని నచటివారు "సేలమాలిగె,, యనియందురు. దానికిది యెడమపార్శ్వమునందున్నది. ఇయ్యది భూమట్టమునకు సమానముగనుంటబట్టి సమీపించినఁగాని చూపరకు గోచరించదు. ఇదిభూమిలోపూర్ణముగ బూడియుండుటచే ద్వారమునిప్పటికిని కనుగొనియుండక పైభాగమునందొకచోట దిగుటకై కప్పనుదీసియున్నారు. దీనిలోభాగమునందంతటను యిద్దఱుమనుష్యులు ధారాళముగా పోఁగలిగినంత వెడల్పుగల మిద్దెవంటిదందు వంకరటింకరగా పోవుచున్నది. ఇట్టిదెందుకు నిర్మింపఁబడినదో తెలియకున్నది.

దీనిసమీపముననే గోడలేనిరాతిపునాదొకటిగలదు. ఇదిభూమట్టమునకత్యున్నతమై నలుచదరముగనున్నది. ఇవ్విధముననేయుండు నట్టిపునాదులు దీనిచుట్టు ననేకములుగలవు. దీనిముందఱ(తూర్పు)భాగమునందు పునాది స్తంభసహితముగనున్నది. మఱికొన్నిపునాదు లగుపడకనే యగోపూడియున్నవి. పూర్వమిది కనుగనానాలీలమైయదియొకగొప్పవీధిగనుండి యీవీధి కేవలము రమ్యమైనదై యుండనోపు.

ఇచ్చటినుండి మఱికొంతదూరముపోగా పాతాళేశ్వరాలయము కానవచ్చును. దీనిమొక్కయునికి రెండుసంవత్సరములక్రిందటనే కనుఁగొనఁబడినది. తత్పూర్వమిది పూడి ప్రజలకగోచరమయి సేవ్యమునకనుకూలముకానిస్థానముగనుండెను. ఈయాలయము నేలమట్టమునకై దాదాఁగ



జములలోతునందున్నయది. ఇందులో నచ్చటచ్చట నీరూరుచున్నందున చుట్టునొకచిన్నకాలువను త్రవ్వించి నీటిని బయటికిఁబోవునట్లు చేసియున్నారు. ఈయాలయము పూర్వాభిముఖమయి విగ్రహహీనమయియున్నది. ఇంకొక గొప్పనందియున్నదిగాని దానిముఖమెవరో విఱుగఁగొట్టియున్నారు. ఇచ్చటినుండి కొంతవఱకు పశ్చిమముగా వెళ్లి యెదుటవచ్చెడిబాటగుండా యుత్తరముగా పోవలయును.

ఈయాలయమునకు సుమారొకమయిలుదూరములో ఉద్దానవీరభద్రాలయము ఉత్తరాభిముఖముయియున్నది. నేటికిని పూజజరుగుచున్నది.

దీనిసమీపముననే పూర్వాభిముఖమయిన చండికేశ్వరదేవాలయమొండుగలదు. ఇయ్యది విగ్రహశూన్యమయి పశుపక్ష్యాదులకు నివాసభూమియైయున్నది.

ఇచ్చటినుండి సుమారు మూఁడుఫర్లాంగులదూరముపోఁగా దారికెడమ పార్శ్వమున పూర్వాభిముఖముగా నాదిశేషసహితమయిన "ఉగ్రనరసింహ,,మను శిలావిగ్రహమున్నది. ఈవిగ్రహముశిరస్సుపై నాదిశేషుని పడగ యావరించియున్నది. ఈవిగ్రహమొక బ్రాహ్మణునిచేఁజెక్కఁబడినదఁట. ఇయ్యది ముక్కలుగ విఱుగఁగొట్టబడియుండియు జూచుటకుమిక్కిలి భయంకరమయి యుగ్రరసము మూర్తీభవించినదేమోయనునట్లున్నది. ఆదిశేషునియొక్కతలయును, ఉగ్రనరసింహస్వామి ముక్కును చేతులను వక్షస్థలమును దుర్మార్గులెవరో నఱికియున్నారు. ఇదిసుమారు [illegible]ము గులయెత్తుగల ఏకశిలామయమయిన విగ్రహము. దీనిసమ్ముఖమునందొక శాసనముగలదు. ఈవిగ్రహమున కిరుపార్శ్వములనుక్రిందఁబడిన రాళ్లనుపల పరీక్షించిచూడ వక్షస్థలమున లక్ష్మి యుండినట్లు తెలియుచున్నది.

ముకలదు.

శ్రీవిరూపాక్షేశ్వరదేవాలయమునుండి తూర్పుగాసుమారు అరఫర్లాంగులదూరమునవెలసిన శ్రీకోదండరామస్వామిదేవాలయముకలదు. ఇది యుత్తరాభిముఖమయి యున్నది. ఇందు శ్రీసీతారామలక్ష్మణవిగ్రహములతిమనోజ్ఞములుగనున్నవి. శ్రీరామలక్ష్మణులు ధనుర్బాణపాణులై సీతతోగూడనిలుచుండిన విగ్రహములు. పూజాయోగ్యమగు నీవిగ్రహములదర్శించువర్శకులకు వెంటనేభయభక్తివినయసంభ్రమము లుద్భవించుటేగాక రాముని కళ్యాణగుణగణములసదృశములగణ్యములనియు, సీతపతిభక్తితత్పరితమనియు, రామలక్ష్మణుల సౌభ్రాత్రముసర్వజనస్తుత్యపాత్రమనియును గ్రహింపనోపుదురు. ఈసీతారామలక్ష్మణులకు నేటికిని నిరంటంకముగ పూజజరుగుచున్నది.

ఇచ్చటనే చక్రతీర్థమని పిలువఁబడు తుంగభద్రప్రవహించుచున్నది. ఇందుండుబండలమీఁద ననేకవిగ్రహములను నాగవిగ్రహములనునమస్కరించుభక్తులను చెక్కఁబడినది. ఇచ్చటతుంగభద్రానది వలయాకారముగ ప్రవహించుటచేఁ నిచ్చటిజలమునకుఁ జక్రతీర్థమని పిలువఁబడుచున్నది.

ఇచ్చటినుండితూర్పుగాఁ సుమారరఫర్లాంగులదూరముపోఁగాఁ గుట్టమైనున్న శ్రీవిఠ్ఠలస్వామిదేవాలయముగుపడును. ఇదిశ్రీవిద్యానగరపుపూర్వదిశను తుంగభద్రానదియొడ్డున గట్టబడినది. ఈదేవాలయమొక్కరాజుకాలములో కట్టబడినదికాదు. కృష్ణదేవరాయలు విష్ణుభక్తిపరాయణులై దీనిఁగట్టనారంభించిరని మందెఱిఁగియుంటిమి. ఈకోవెలయొక్కశిలాద్వారము పూర్వాభిముఖము. గర్భాలయముయొక్కయు



పార్శ్వద్వయంబుననుండు మండపములయొక్కయు శిల్పప్రబంధనము వేయినోళ్ళశ్లాఘించినను దీరదు. ఏకశిలామయముగ నొక్కొక్కరాతికంబములోఁ బదియారుచిన్నకంబములుండి నానావిధములగు విగ్రహములును హితము చెక్కఁబడినది. గుడికప్పులుగూడ శిలామయమయి యందలి శిల్పప్రబంధముజూడ నాకాలములోని శిల్పకళావిజ్ఞానౌన్నత్యమునుదెలుపుచున్నది. గుడికప్పుచూరులనుండి మూలలలోవ్రేలాడుచుండు రాతిగొలుసులకు దీపపుఁగుడ్డెలఁదగిలించుచుండిరట. ఇప్పుడీకొలుసులు కానరావు. ఈకోవెలతక్కినకోవెలవలె శిలామయనిర్మాణము. ఇనుముగాని, కొయ్యగాని, మేకుగానిలేక నిర్మింపఁబడియుండుటఁజూడ దర్శకులాశ్చర్యనిమగ్నమానసులుగాకపోరు. చక్కఁగాఁ బరిశీలించిచూడ నీయాలయము సంపూర్ణవైభవముతోనున్నప్పుడు కప్పులకును కంబములకును వివిధపురంగులు పూయఁబడినట్లు జాడలుకానవచ్చుచున్నవి. ఇట్లు వింతవన్నెలుగలిగి దీపకళికాప్రాంతంబులనిగ్గులుగులుక వాద్యఘోషనభోంతరాళమున వెలంగుచుండు వైభవకాలమునాటి సాయంసమయములెట్లుండినవో యూహింపనగు. ఇప్పుడీదేవళము విగ్రహహీనమైయున్నది. హిందూమతద్వేషులగు తురుష్కులచేఁ బాడుచేయఁబడుటయేగాక ఇటీవల ద్రవ్యమున్నదనుభ్రాంతిచేత బైరాగులచే నందుండువిగ్రహములుపెళ్ళగింపఁబడినది. పూర్వపుస్థితినియూహించి ప్రస్తుతపుహీనదశనుజూడ మనస్సంతాపముగలుగకమానదు.

ప్రాకారములోమధ్య శిలామయమైన రాతిచక్రములు, గడ్డయిరుసులు గల తేరొకటియున్నది. ఆరథముచుట్టును స్త్రీలు చిలుకలపైఁ గూర్చుచుండి చిలుకలులాగనట్లు తేరులనడిపించునట్లు చెక్కఁబడి ముద్దులు మూట

ధీమవీరాగ్రేసరులకు పుట్టినిల్లై తురుష్క రాజులగుండియలవియునట్లు దిన దినాభివృద్ధియై యైశ్వర్యశౌర్యవిద్యాప్రాభవంబుల బ్రపంచమున నీవు లేవని పశ్చిమఖండవాసులచేతను పూర్వఖండవాసులచేతను వేనోళ్ళబొగడ్తగన్నదై శిల్పకళానైపుణ్యమునకు విహారభూమియై శరణాగతులకు రక్షకస్థానమై విలసిల్లిన విజయనగరరాజంబిప్పుడు రూపరహితమై జనశూన్యంబై ఆరోగ్యపంకమై యరణ్యమై చూపఱకు శోకసంతాపమును గొల్పుచున్నది. ఆహా! కాలపరిభావము!!

కృతిసమర్పణము.

అనంతపురమునందలి ధర్మవరపువాస్తవ్యుఁడ శ్రీవత్సగోత్రో
ద్భవుండ ఆంజనేయాఖ్యుఁడ నగు నేను శ్రీమద్వేం
కటేశ్వర కరుణాకటాక్షవీక్షణంబున వరదించి
రామయాఖ్యుండును సారమాంబయు
ను నాముదుసలితలిదండ్రు
లకు నమస్కారసహస్రం
బుల ర్పించి యేతచ్చ
రిత్రంబును న
ర్పిం
చితి
ని

సమాప్తము.

:: 5 ::

| | | |
|---|---|---|
| P.Tulasi Rao | 20067D | PVND Prasad |
| Kari Bhushamma a/s K.Vijaya Lakshmi | 20267D | G.Bujji Babu |
| P.Budigamma | 26367D | K.R.Sekhar |
| V.Sreenivasa Rao | 26467D | G.Bujji Babu |
| G.Namasiva Rao | 26667D | PVND Prasad |
| S.Veeranjaneyulu | 26967D | PVND Prasad |
| K.Singaiah | 27[illegible]67D | PVND Prasad |
| Ch.Srinivasa Rao | 34567D | [illegible].Ramana Prasad |
| Y.Srinivasa Rao | 39667D | G.Bujji Babu |
| P.Sridhar | 39767D | G.Bujji Babu |
| B.Kumara Swamy | 39867D | PVND Prasad |

